**ANANTHA SATHYALU**

*free verse in Telugu*

by

**Dr. J. Bapu Reddy**

First Edition : **1979**

Third Revised and Enlarged Edition : **2003**



*Price :* **Rs. 100/-**
**US $10**

*Published by :*
**Jubilee Publications**
Plot 10, Road 5
Jubilee Hills
Hyderabad - 500 033 A.P. - INDIA

*Copies available at :*
**Vishalandhra Publishers**
4-1-435, Bank Street, Vignan Bhavan
Hyderabad and Branches

**Navodaya Book House**
Opp. Arya Samaj Mandir
Kachiguda, Hyderabad - 500 027.

*Designed & Printed at :*
**Vipla Computer Services**
*(Designers & Multi Colour Offset Printers)*
Nallakunta, Hyderabad - 500 044
Phone : 2767 6910

*Dedicated to Mr. A.V.S. Raju, Chairman, Nagarguna Construction Company Ltd., and a staunch devotee of Bhagavan Satya Sai Baba on whom he Authored prolific devotional poetry.*

*First copy presented to Mr. B. Ramalinga Raju, Chairman, Satyam Computer*

# అంకితం



కృతి స్వీకర్తలు

**శ్రీమతి వేంకట సత్యనారాయణమ్మ - శ్రీ ఎ.వి.యస్. రాజు**

ఆదర్శ దంపతులకు

అభిమాన పురస్సరంగా 'అనంతసత్యాలు' కృతి అంకితం.

తమ జీవితాలను ధార్మిక చింతనతో, సాంఘిక సేవాతత్పరతతో, అభ్యుదయమార్గాన వెలిగిస్తున్న ఈ పుణ్యదంపతులకు వారి వివాహ స్వర్ణోత్సవ సందర్భంగా సమర్పిస్తున్న అనంత సత్యాక్షర అభినందన మాల.

విశ్వవిఖ్యాత పారిశ్రామిక వేత్త, విజ్ఞాన ప్రజ్ఞాన సంపన్నులు



**శ్రీ బి. రామలింగ రాజు గారికి**

ఛైర్మన్, సత్యం కంప్యూటర్స్ లి.

అభినందన పూర్వకంగా

ఈ కృతి తొలిప్రతి సమర్పితం

**- జె. బాపురెడ్డి**

కృతికర్త

# సత్యవ్రతులకు
# అంకితమౌతున్న సత్యాలు

"సత్యాసాయి"ని అక్షరాలా సేవిస్తున్న
సత్యవ్రతులు మీరు
సత్యనారాయణి, సత్యనారాయణుడు
అక్షరాకృతులైన నామకరణాకృతులు మీరు
రాజయోగంలో కర్మయోగం - కర్మయోగంలో భక్తియోగం
సాధిస్తున్న ధర్మ యోగులు మీరు
అన్నవరంలో వెలసిన పరతత్వ రూపుని
సత్యతత్వ విదులైన జ్ఞానయోగులు మీరు
ఒకరిలో ఒకరు సత్యదర్శనం చేసుకుంటున్న
అద్వైత రసాద్వైత ఆనంద దంపతులు మీరు
ఇపుడు,
మీ వివాహ స్వర్ణోత్సవం విజయాశీస్సులందిస్తున్న
నిత్యనూతన రాగ యోగులు మీరు!

ఎ.వి.యస్. రాజుగారూ !

చరిత్రను గర్భీకరించుకున్న నీ.
*"అల్లూరి వెంకట సత్యనారాయణరాజు"* నామకరణాన్ని
మాటలకు ఇంపు కుదింపు లోనే ఉందని
'ఎ.వి.యస్.రాజు'గా సూత్రీకరించుకున్నావు -
అగణిత గేయ మాలికలతో
సత్యసాయిని ఆరాధిస్తున్న సత్యసాధకుడవు నీవు
సత్య బోధకుడిన్న అక్షరాలా సేవిస్తున్న
సత్యోపాసకుడవు నీవు -
నీ రచనల్లో "రామరసామృతం" కురిపిస్తున్నావు
"శ్రీసాయి సుధా మాధురులు" అందిస్తున్నావు
'సత్యాలను' సాహితీకరిస్తున్న స్వాప్నికుణ్ని నేను -

అగణిత భావసత్యాలతో
అనంతాన్ని అనుభూతిస్తున్న సత్యపిపాసువును నేను!
అందుకే నా "అనంతసత్యా"ల కావ్యం
ఆదర్శ దంపతులైన మీకు అంకితం కావడం భావ్యం!
నేను ఏకైక సత్యాన్ని
అనేకానేక దీపాలుగా వెలిగిస్తుంటే
నీవు ప్రేమైక సత్యసాయీశున్ని
లెక్కలేని రూపాలుగా తిలకిస్తున్నావు
ఈ దీపాలవెలుగుకు - ఆ రూపాల రంగులకు
అక్షరసాక్షి సంతం - ఈ అంకితం !
ఇది మన స్నేహానికి రజతోత్సవం
నా కవితాయాగానికి స్వర్ణోత్సవం
సత్యానికి సత్యం అంకితమౌతున్న సత్యోత్సవం
సాహితీలోకానికి ఆనందోత్సవం!
బాసర జ్ఞాన సరస్వతీ పీఠం
భద్రాచలం సీతారాముల నిలయం
వెలసిన గోదావరి తీరం
మన ఉమ్మడి శ్రీకారం - మమకారం
గోదావరి కేదారాలలో పండించిన అనుభవం
గోలకొండుకం మోసుకొచ్చావు!
నందికొండలో వెలసిన
ప్రబుద్ధ నాగార్జునుని స్మరిస్తూ
నిర్మాణాల కర్మాగారాల సంస్కృతిలో
కార్మికుడవై కష్టఫలాలు ఆర్జించావు
ధార్మికుడై, మార్మికుడవై సమాజ సంక్షేమం కోసం
సంపదను సద్వినియోగం చేస్తున్నావు!
రణశీలురైన రాజవంశంలో పుట్టి
వితరణశీలుడవై

జనవంశంలో రాణిస్తున్నావు
అమరజీవి విప్లవవీరుడు
అల్లూరి సీతారామరాజు వీరావేశం నడిపిస్తున్న
ప్రగతియాత్ర సాగిస్తున్నావు
చేపట్టిన కార్యాలన్నిటిలో నీ పట్టు నిరూపిస్తున్నావు -
మా చెల్లమ్మ "సత్యనారాయణి"
చేసుకున్న పుణ్యపు ఫలాలు
నీ జీవిత సాఫల్యాలుగా దీపిస్తున్నావు -
తెలుగు కట్టు, బొట్టు - తెలుగు మాట, పాట
నీ చిరునామా చేసుకున్నావు
లక్షల, కోట్ల కన్నా విలువ గల
లక్షలాది చెట్లు నాటుతున్న
వనరక్షకుడవు నీవు
విద్యా, వైద్య, విద్యుత్ నిర్మాణ యజ్ఞాలతో
జన్మభూమి సేవ చేస్తున్న జనరక్షకుడవు నీవు -
ఏ రంగంలో కాలు పెట్టినా
విజయం నిన్ను వరిస్తున్నది
తెలుగు తల్లిని సేవిస్తున్న
భరతమాతను పూజిస్తున్న నిన్ను
బంగారు భవిష్యత్తు పిలుస్తున్నది -
కారణ జన్ముడు శ్రీ బైర్రాజు సత్యనారాయణరాజు
సత్యాత్మ స్వప్నాల పంట
ఈ కృతి తొలి ప్రతిని స్వీకరిస్తున్న
శ్రీ రామలింగరాజు
ఆయన
కాలానికి దారి చూపిస్తున్న దేశభక్తుడు,
అంతరిక్ష యవనిక మీద
అక్షర సత్యాలు వెలిగిస్తున్న విజ్ఞాన జిజ్ఞాసవు

ఆబాల గోపాలానికి అప్పుడు
మన ఇరువురు స్నేహ సందీప్తుడు.
పేద పల్లె సీమల్లో
విద్యా వైద్య జ్యోతులు వెలిగిస్తున్న
త్యాగ ధనుడు సహ జీవన ఘనుడు.
దుర్భిక్ష పీడితుడైనా - అమెరికా అధ్యక్షుడైనా
మానవత్వ మందిరంలో ఒకరేనని భావించే
సమతావాది సత్యవేది ఆయన.
మనం ముగ్గురం
ఈ అనంత సత్యాక్షర వృక్షం క్రింది
కలుసుకున్నందుకు ఆనందిస్తున్నాను.
మన పవిత్ర మైత్రి
మానవలోక కళ్యాణానికి
సవితృ దీప్తి కావాలని ఆకాంక్షిస్తున్నాను.

మీ వివాహ స్వర్ణోత్సవ శుభసందర్భంలో
మీకు సాహితీలోకం పక్షాన
బంధుమిత్రుల సమక్షాన
అభినందన మందార మాలలు అందిస్తున్నాను.
ఏటేటా
సత్యాక్షరదీపాలతో
విశిష్ట విజయ రూపాలతో
మీ వివాహ జన్మదినోత్సవం జరుపుకుంటామని
విశ్వసిస్తున్నాను.

శుభం భూయాత్...

హైదరాబాద్
తేది. 21-2-2003 (శుక్రవారం)

**- జె. బాపురెడ్డి**

# మళ్లీ ఒక మాట

"అనంత సత్యాలు" ఇంతవరకు నేను చేసిన రచనలన్నిటిలో శిఖరాయమానమైంది. నా తాత్విక ఆధ్యాత్మిక భావచేతనాన్ని ప్రతిబింబించే ఈ గ్రంథం తొలిసారి 1979లో జూలై 26 నాడు డెట్రాయిట్‌లో జరిగిన రెండవ ఉత్తర అమెరికా తెలుగు మహాసభల్లో ఆవిష్కరించబడింది అది ఒక మరుపురాని మధురానుభూతి. వందలాది ప్రవాసాంధ్రులతో కళకళలాడిన ఆసభలో పాల్గొన్న అనేక మంది పెద్దలు నన్ను ఆశీర్వదించారు. ఆ తర్వాత 1986లో ముఖ్యమైన మార్పులు చేర్పులతో రెండవ ముద్రణ వెలువడింది. తరువాత తాత్విక చింతనకు సంబంధించని కొన్ని కవితలను తొలగించి, ఈ గ్రంథం యొక్క ప్రధాన ఇతివృత్తమైన తాత్విక, ఆధ్యాత్మిక భావచింతనకు చెందిన మరికొన్ని కవితలను చేర్చి రెండవ ముద్రణగా 1986లో రూపొందింది. ప్రఖ్యాత సాహితీ విమర్శకులు డా॥ కొత్తపల్లి వీరభద్రరావు గారు తీర్చిన సుదీర్ఘ "ఆముఖం" ఈ గ్రంధానికి ఒక కొత్త శక్తిని ప్రసాదించింది. ఒక ప్రత్యేక నూతన భావధారలను ఆవిష్కరించిన కావ్యంగా రూపొంది అనేక మంది విజ్ఞాన శాస్త్రవేత్తల అభినందనలనందుకొంది. తొలి ప్రచురణ తరువాత నేను వచన కవితా రూపంలో తత్వజ్ఞాన స్పర్శలో వ్రాసిన సుమారు 30 క్రొత్త కవితలతో సరిక్రొత్త అందాలతో మళ్లీ మీ ముందుకు వస్తున్నది. అనేక మంది విజ్ఞాన ప్రజ్ఞానాధనుల ప్రశంసల నందుకుంది. అందుకు నాకెంతో సంతృప్తిని ఆనందాన్ని అందించింది. సరికొత్త అందాలతో మీ ముందుకు వస్తున్నది.

వచన కవితా ప్రక్రియలో వెలువడ్డ ఆధ్యాత్మిక తాత్విక చింతనాపరమైన ఒక విశిష్ట కావ్యంగా సహృదయులు, సాహిత్య విమర్శకులు ఈ గ్రంథాన్ని గుర్తించినందుకు నాకెంతో సంతృప్తి కలిగింది. ఈ కోవకు చెందిన నా ముద్రితా ముద్రిత వచన కవితలన్నీ ఇందులో చేర్చబడ్డాయి. ఈ "అనంత సత్యాల" గూర్చి నేను ఇంతకు ముందు అభియుక్తం చేసిన కొన్ని అభిప్రాయాలను ఇక్క పునశ్చరణం చేస్తున్నాను.

"ప్రకృతి శాస్త్రాలు, విజ్ఞాన శాఖలు కొన్ని కొన్ని నిర్దిష్టమైన సత్యాలను ఆధారంగా చేసుకొని తమతమ పరిధిలో వస్తు తత్వాన్ని పరిశీలించి ఏదో ఒక ప్రయోజనాత్మక ఫలితాన్ని సాధిస్తున్నాయి. కాని, కవిత్వం ఒక వస్తువులోని ఏదో ఒక సత్యానికి కట్టుబడి సంతృప్తి చెందదు. దేశ కాలానుగుణంగా భౌతిక ప్రయోజనానుకూలంగా ఒకే వస్తువులో అనేకానేక సత్యదర్శనం చేయగల మహాశక్తి కవిత.

పంచేంద్రియానుభవ యోగ్యమయిన సృష్టిని పరిశీలించి, విశ్లేషించి ప్రయోజనాత్మక సత్యాలను ప్రబుద్ధం చేసేవి లోకంలోని చదువులు, శాస్త్రాలు, కాని, కవిత భౌతిక సృష్టిగతమయిన భావసృష్టి చేస్తుంది. ఉన్న దానిలో ఉన్న దనుకున్నదానిలో లేనిదాన్నీ, లేనిదానిలో లేదనుకున్నదానిలో ఉన్న దాన్నీ దర్శించి, మనకు నవనవానుభూతులు కలిగిస్తుంది కవిత. కొంచెం గంభీరంగా తరచి చూస్తే ప్రతి వస్తువూ కొన్ని సత్యాలకు నిలయంగా భాసిస్తుంది. ఒక వస్తువులో మన మింతవరకు చూడని ఒక సత్యాన్ని చూడగలిగినప్పుడు కలిగే రసానందం-రసానుభూతి అనిర్వచనీయమైనవి. అందమయిన అమ్మాయి మోములో దాగిన చంద్రబింబాన్ని చూపించిన ఆదికవి అలాంటి అస్పృష్టసత్యాన్ని స్పృశించి ఆనందానుభూతిని పంచాడు. రహస్యమేమిటంటే-ప్రతివస్తువులోనూ ఏవోకొన్ని, మరికొన్ని, ఇంకాకొన్ని సత్యాలు గర్భితమై ఉన్నాయి. ఒక కవి ఎన్నెన్ని క్రొత్త గుప్తసత్యాలపై గల తెర తీయగలిగాడన్నదే ఆ కవి ప్రతిభా పాండిత్య విశేషాలకు ప్రథమ ప్రబల తార్కాణం.

అయితే ఏ వస్తువులో ఎన్ని సత్యాలు నిక్షిప్తమై ఉన్నాయన్నదే ఇక్కడ కీలకమయిన ప్రశ్న. అందుకు నా వినమ్ర సమాధానమే ఈ రచన. సత్యాలు అనంతం-ప్రతి వస్తువులో దాగివున్న సత్యాలు అనంతం. ప్రతి వస్తువూ దేశ కాలాల లీలారూపమే. అందుకే దేశ కాలాలను నిర్వచించే ఆ అనంతత్వమే దేశ కాలబద్ధమయిన ప్రతి వస్తువునూ పరివేష్టించింది.

భౌతిక సత్యాలు, భావ సత్యాలు, కల్పనాసత్యాలు, అనుభూతి సత్యాలు-అన్ని సత్యాలూ కవితాసాహిత్య సుందర బృందావనంలో విరబూసిన అగణిత భావకోరకాలే. సత్యాలు రసపోషకాలు; సత్యాలు అనుభూతి హేతువులు; సత్యాలు ఇంద్రియానంద ప్రేరకాలు-సత్యాన్వేషణమే, సత్య దర్శనమే, సత్యావిష్కరణమే సాహిత్య పరమావధి.

సత్యాలు అనంతమన్న భావస్ఫూర్తితోనే దైవత్వ మానవత్వాల ఏకత్వ రూపదర్శనం చేశాను. దైవం సత్యస్వరూపి. సత్యం అనంతరూపి. అనంత సత్యారాధనమే ఈ రసానందకావ్యం.

కవితా వస్తువులు, కవితాసత్యాలు అనంతం. నా పరిమిత జీవచైతన్యానికీ, భావ చైతన్యానికీ అందిన కొన్ని సత్యచిత్రాలను, రసానుభూతులను మీ కందిస్తున్నాను. అవి ఎందరి దృక్పథాలను సకల జనానంద సంకల్పోన్ముఖుల్ని చేయగలగితే అంతటి ఆత్మానందభరితుణ్ణవుతాను.

సర్వసమతాసత్యవాదం నాది. సాహిత్యసామ్యవాదం నాది. హేతువాద

నినాదాలను ఇతర శాస్త్రాలకు వదిలేసి, హృదయవాద నాదాలను కదిలించాలనే సంకల్పం నాది; ప్రబోధదృష్టి నాది. ప్రగతిదృష్టి నాది."

నాతో సుదీర్ఘ స్నేహానుబంధం పెంచుకుంటున్న, స్వచ్ఛంద సాహిత్య గంధం పంచుకుంటున్న, అభ్యుదయ కార్యశీలి, బహుముఖ ప్రతిభాశాలి శ్రీ ఎ.వి.ఎస్. రాజు గారు సతీసమేతంగా ఈ మూడవ విస్తృత ముద్రణకు చేయూతమిచ్చి, స్నేహోపాయనంగా కృతిని "అంకితం" తీసుకున్నందుకు నేను ధన్యుణ్ని. వారికి నా కృతజ్ఞతా పూర్వక "ప్రశంసాంజలి". శ్రీ ఎ.వి.ఎస్. రాజుగారు రైతు బిడ్డగా పుట్టి అంచలంచలుగా ఎదిగి, శిఖరాయమానుడైన పారిశ్రామికవేత్తగా కీర్తిగడించి భవన నిర్మాణరంగంలో అపారమైన సేవలందిస్తున్నారు. భవన నిర్మాణంతో పాటు ఆయన భగవాన్ సత్యసాయి కృపాకటాక్షములచేత కవన నిర్మాణం కూడా చేస్తున్న సవ్యసాచి. ఆయన రచించిన సహజ సుందర రామాయణ గ్రంథం, సత్యసాయి ప్రభోదనలకు అద్దంపట్టి స్వామి విరాట్ స్వరూపాన్ని కొనియాడే స్వచ్ఛంద భావ కవితలు వేలాదిగా రచించారు - ఆ స్వామి అక్షయాశీస్సులు అందుకున్నారు. ఆయన ఎంతో ఉదారంగా తన సంపదను కొంత సమాజ సేవ కోసం, సాహిత్య సంస్కృతుల పురోగతికోసం వినియోగిస్తున్నందుకు అభినందనీయులు. కృతి స్వీకర్తలైన ఆదర్శ దంపతులు వెంకటసత్యనారాయణమ్మ, వెంకట సత్యనారాయణరాజు గారలకు వారి పుత్ర పౌత్రానేక శోభితమైన కుటుంబానికి ఈశ్వరుడు, సాయీశ్వరుడు ఆయురారోగ్య ఐశ్వర్యాలు ప్రసాదించుగాక!

ఈ కృతి తొలిపతిని స్వీకరించడానికి అంగీకరించిన జగత్ విఖ్యాత పారిశ్రామిక వేత్త విజ్ఞాన ప్రజ్ఞాన కోవిదులు "సత్యం కంప్యూటర్ సర్వీసెస్ ప్రైవేట్ లిమిటెట్ కంపెని అధిపతులు శ్రీ బైర్రాజు రామ లింగరాజు గారికి నా పులకిత హృదయ పూర్వక ధన్యవాదాలు. ఆయన అలవోకగా రచించిన అముద్రిత కవితలు ముద్రిమై సాహితీ లోకానికి నవ వసంత శోభ చేకూర్చాలని ఆశీస్తున్నాను. పేద పల్లె సీమలకు అయన అందిస్తున్న అపారమైన విద్యావైద్య సేవలు ప్రశంసనీయాలు. వారి తండ్రి గారు కీ.శే. బైర్రాజు సత్యనారాయణరాజుగారు ప్రేమానురాగాలతో కలిగించిన స్ఫూర్తితో వారు అదిరోహించిన అభ్యుదయ శిఖరాలు అబాలగోపాలానికి ఎంతటి ఆనంద దాయకమో అంతటి ఆదర్శప్రాయము. ఇంతకు పూర్వం వారు నా కావ్యసంపుటి "అక్షరానుభూతులు"ని అంకితం తీసుకొని నా పట్ల చూపించిన ఆదరాభిమానులు ఒక మరుపురాని మరువలేని అమృతానుభూతి. వారు సాహిత్య సంస్కృతి రంగాలకు చేస్తున్న సేవతోపాటు అత్యాధునిక విజ్ఞాన ధాయకమైన కంప్యూటర్ సేవలు ప్రపంచ స్థాయిలో అందిస్తున్నందుకు ఈ సందర్భంలో వారిని ఆత్మదఘ్నంగా అభినంది

స్తున్నాను. శ్రీమతి నందిని రామలింగరాజు ఆదర్శ దంపతులను వారి కుటుంబ సభ్యులందరిని భగవంతుడు చల్లగా చూడాలని ప్రార్థిస్తున్నాను.

నిరంతర సాహితీ తపస్వి, సువిశాల యశస్వి డా॥ కొత్తపల్లి వీరభద్రరావుగారు ఈ కావ్యాత్మను తమ అమూల్య భావదీప్తితో ఆవిష్కరించారు. నాపట్ల, నా సాహిత్య వ్యవసాయం పట్ల గత నాలుగు దశాబ్దాలుగా ఆదరాభిమానాలు చూపుతున్న నిరాడంబర నిత్య సత్యాన్వేషి ఆయన. విజ్ఞాన ప్రజ్ఞాన శిఖరాలు అందుకున్న వీరభద్రుడు తన సిద్ధవాక్కులతో ఆత్మానుభూతితో నన్నాశీర్వదించినందుకు కృతజ్ఞతాంజలి ఘటిస్తున్నాను.

ప్రఖ్యాత విద్యావేత్త, దార్శనికుడైన విమర్శకులు, సృజనశీలి, విజ్ఞాన దాయకమైన రచనాశిల్పి డా. ఐ.వి. చలపతిరావుగారు ఇంగ్లీషులో ఈ గ్రంధానికి సునిశితమైన ఉపోద్ఘాతం వ్రాశారు. అందుకు నేను ఆయనకు పులకిత హృదయంతో నమోవాకాలు సమర్పిస్తున్నాను. లోకమాన్యులు భారతీయ తత్వవేత్తలు ఆచార్య కె. సచ్చిదానంద మూర్తిగారు, ఆచార్య వి. మధుసూదనరెడ్డి గారు వారి అక్షరాశీస్సులు అందించి నా అనంత సత్యాన్వేషకు పుష్టిని చేకూర్చి నందుకు వారికి ఋణపడి ఉన్నాను.

నా పేర ఒక ప్రజాట్రస్టు ఏర్పాటు చేసి, భారతీయ సాహిత్య సంస్కృతిక వికాసాలకు తోడ్పడుతున్న మిత్రులందరికీ, దేశవిదేశాలలో నన్ను అభిమానించి, సత్కరించి పోత్సహిస్తున్న మిత్రులందరికీ ముఖ్యంగా మాన్యవదాన్యులుకు నా ప్రశంసా పూర్వక అభివందనలు.

నా సాహిత్య కృషిని గుర్తించి నా పుస్తకాలను ప్రచురించిన 'జూబిలీ పబ్లికేషన్' వారికి ముఖ్యంగా శ్రీ జె. మారుతి గారికి నా కృతజ్ఞతలు. గ్రంథాన్ని ముచ్చటగా ముద్రించిన విప్ల కంప్యూటర్ సర్వీసెస్ వారికి నా ప్రత్యేక ధన్యవాదాలు. నా పుస్తకాలను పాఠక లోకానికి అందిస్తున్న సేవాతత్పరులైన విశాలాంధ్ర పబ్లికేషన్స్ వారికి ముఖ్యంగా శ్రీ రాజేశ్వర్‌రావుగారికి నా ప్రసంశాపూర్వక కృతజ్ఞతలు.

నా ఆత్మజ్యోతియై నా సాహిత్య హేతియై నన్ను వెలిగించే నా జీవితేశ్వరి రాజేశ్వరికి నా ప్రబుద్ధ ప్రణవాంజలి.

జిజ్ఞాసువులూ, రసజ్ఞులూ అయిన పాఠకలోకానికి ఆలోచనామృత కలశంగా ఈ సంపుటిని అందిస్తున్నాను.

**- జె. బాపురెడ్డి**

# ఆ ముఖం

"సుకవితా యద్యస్తి రాజ్యేనకిమ్" అన్నారు మన పెద్దలు. సప్త సంతానా లలో ఖిలంకానిది కృతిగనుక, కవితామయమైన ఆ కృతికి- సప్త సంతానాల్ని ప్రతిష్ఠించేశక్తి ఉన్న రాచరికానికి మించిన స్థానం ఇచ్చారు, ప్రపంచం కల రూపు తెలిసిన మనవారు. నశ్వరమైన జగత్తులో సుస్థిరమైనది కృతి గనుక, దానికి కృతి భర్తలు కావాలని మన రాజులు, జమీందారులు, చక్రవర్తులు పూర్వంలో తహ తహలాడారు. వారిలో చాలామందిని నేడు మనం స్మరించడానికి కారణం వారు కృతి భర్తలు కావడమే! కృతి భర్తలకే ఈ శాశ్వతత్వం లభించినప్పుడు కృతి కర్తల విషయం వేరే చెప్పాలా?

గుణసమగ్రతను ప్రసాదించే విషయంలో పరాఙ్ముఖత సహజ లక్షణమైన "విశ్వసృజః ప్రవృత్తి" ఒక్కొక్క కవి పురాకృతపుణ్యవిశేషంచేత - సమగ్రతను ప్రసాదిస్తే, సువర్ణానికి సుగంధం అబ్బినట్లే గదా!

"అనంత సత్యాలు" వ్రాసిన మన బాపురెడ్డి గారి విషయంలో ఈ పని జరిగింది. ఆయనలో కావ్యనిర్మాణ చతురత, రాజకార్యనిర్వహణ దక్షత ఏకత్రిత మయ్యాయి. పై నానుడిలో, "రాజ్య" శబ్దం అధికారానికి ఉప లక్షణం. మన సాహిత్య చరిత్రలో ఇద్దరు, ముగ్గురు ఈ పూర్వపుణ్యం ఉన్నవారు కనబడుతున్నారు. ఈ ప్రజాయుగంలో ఈ పుణ్యం సామాన్య ప్రజలలో నుండి వచ్చిన కవికి దక్కడం సహజం! ఇక్కడ ఇదే జరిగింది!

ఈ ప్రజాయుగంలో రోజురోజూ మారుతూవస్తూ ఉన్న "ఇజా"ల నిజానిజాలు గుర్తించి; మనుష్యులలో లాగే కవిత్వంలో కూడా "మంచిచెడ్డలు" రెండే భేదాలు అని గ్రహించి; కవిత్వం అనుభూతి విషయంలో హృదయదఘ్నంగా ఉండవలసినా, సృజనవేళ బుద్ధిదీపం దానికి దారి చూపింపవలసిన అవశ్యకత ఉన్నదనే విషయం ఆకళింపునకు తెచ్చుకొని రచన సాగించే కొద్దిమంది కవులలో బాపురెడ్డిగారి స్థానం ఉన్నతమైనది. వివిధ సాహిత్యరీతులలో పరవళ్ళు త్రొక్కిన వీరి కవితా స్రవంతి క్రమక్రమంగా గభీరతను గాంభీర్యాన్ని సంతరించుకొని జీవనదిగా సాగిపోతోంది.

సృష్టిలోని సమస్త పదార్థం కవితావస్తువుగా-కవిగారి రచనా పాటవాన్ని బట్టి, తాత్త్వికదృష్టిని బట్టి - సత్యం, శివం, సుందరంగా భాసిస్తుందని అనుభవపూర్వకంగా గ్రహించిన ఈ కవి తన కవిత్వానికి సమన్వయం ప్రాణంగా చేసుకోగలిగాడు. ఇందువల్లనే ఈయన కవిత్వంలో దేహానికి, మనస్సునకు, బుద్ధికి సముచిత స్థానాలు లభించడమే కాకుండా- చాలామంది ఆధునిక కవులలో కనబడని అతీంద్రియమైన ఆత్మవస్తువుతో వాటికి సమన్వయం చేసే ప్రయత్నం కనబడుతుంది.

మహాకవికి మామూలు కవికి తేడా ఎక్కడ ఉంది అని పరిశీలిస్తే ఆయా కవుల తత్త్వదృష్టిలో ఉంది అనాలి. ఈ విషయాన్నే ఒక ఇంగ్లీషు విమర్శకుడు "Great poets are judged by the frame of mind they induce in us " అని చెప్పాడు.

మహాకవులెవ్వరూ సమన్వయం చెయ్యని సందేశం లేని కావ్యాలు వ్రాయలేదు. "తీర్థానికి తీర్థం, ప్రసాదానికి ప్రసాదం"గా ఉన్న రచనలు, ఎంత రమణీయంగా ఉన్నా ఏకసూత్రబద్ధం కాని మణులవలె, విడిగా పొడిగా ఉంటాయి కవి చేసే సమన్వయమే ఇచ్చే సందేశమే ప్రాణరూపమైన అంతర్నిహితమైన- కావ్యాన్ని అర్థవంతంచేసే ఈ సూత్రం. విశ్వజనీనమైన రచనలు చేసే కవులలో ఈ సందేశం, సర్వకాలాలకు సర్వులకు పనికి వచ్చేలా ఉంటుంది. బాపురెడ్డిగారి కవిత్వంలో కనబడేది- అంటే ఉన్నానని సూచించేది- వాచ్యంకాని- ఈ సందేశ సూత్రం. వీరి పూర్వపు రచనలలో దృశ్యాదృశ్యంగా మబ్బుచాటు వెన్నెల వెలుగుగా దర్శనమిస్తూ వచ్చిన ఈ సందేశాత్మకతత్త్వ దృష్టి "అనంత సత్యాలు" కావ్యంలో- కవి అనంత సత్యాన్ని దర్శించి ప్రదర్శించే నాటికి అన్నమాట- పంచేంద్రియ పరిధి దాటి ఆనందాంబర వీధిలో విహరించే స్థితికి వచ్చింది. దీనితో, కవి మహాకవి అయ్యాడు. ఈ కావ్యపఠనంవల్ల మనకు కలిగే అనుభూతికి, ఇతర కావ్యాలు చదవడంవల్ల కలిగే అనుభూతికి ఉన్న తారతమ్యం- సంతోషానికి ఆనందానికి ఉన్నంత ఉంది!

చిన్నప్పుడే వలచి వచ్చిన కవితా లతాంగిని ఏకపత్నిగా ఏలుకొంటూ ఉన్న బాపురెడ్డిగారిలోని దాక్షిణ్యం, భంగ్యంతరాలలో ఆ కవితా లతాంగినే సంతరించు

కోవడంలో కనబడుతుంది. ఆనంద తుందిలమైన అంతరంగంతో అఞ్జులు సాచి ఆకాశాన్ని అందుకోవాలని చేసే ప్రయత్నాలలో ఆయన ఎగిరినంత ఎత్తూ ఆమె కూడా అలవోకగా వెంట పోతుంది. హిమాలయోత్తుంగమైన కవిత, మహిమాలయం అయింది ఇందువల్లనే! శ్రావ్యమైన శబ్దం, రమ్యమైన అర్థంతో హృద్యమైన అనుభూతి నిస్తుంది ఇందువల్లనే! హృదయం, మేధ - సరిసమంగా పనిచేసే మహాకవికే ఈ వాగర్థ ప్రణయం సాధ్యపడుతుంది. అన్ని వస్తువులలో, అన్ని పరిస్థితులలో అందాన్ని చూచి దాన్ని ఇతరులకు అందించే నైపుణ్యం మహా కవిసొత్తు. సర్వే సర్వత్ర ప్రసన్నత ఉట్టిపడే సమాస ఘటన, మాటల కూర్పు ఈ కవి సొమ్ము. సహృదయుల హృదయాలను ఆకట్టుకొనే రుచిర భావాలు, అందమైన మాటల చీరలు కట్టుకొని కులుకుతూ బోటులవలె కనబడతాయి. ఈ మాటల మాటున దాగిన "భావం" స్వస్వరూప జ్ఞానం ఉన్న కవికే ప్రథమ దర్శనమిచ్చి తరువాత సహృదయులను కరుణిస్తుంది. ఇందువల్లనే, శబ్ద శక్తిని గ్రహించిన కవికి అది ఎలా సాక్షాత్కరిస్తుందో, ఎలా వశమవుతుందో వేదకవి ఇలా ప్రవచించాడు:

*"ఉతత్వః పశ్యన్న దదర్శవాచ-*
*ముతత్వః శృణ్వన్న శృణోత్యేనామ్!*
*ఉతో త్వస్మై తన్వం విసస్రే*
*జాయే వపత్య ఉశతీ సువాసాః॥"*

(ఒకడు వాక్కును చూస్తూ ఉన్నా చూడలేడు గదా! ఇంకొకడు ఈ శబ్దాన్ని వింటూ ఉన్నా వినలేడు! ఈ వాక్కు (సన్నని) శుభ్రమైన బట్టలు ధరించి ఉరకలు వేసే కోరికలున్న భార్య భర్తకు వలె మరి ఒకడికి శబ్ద శాస్త్రం తెలిసిన వాడికి తన శరీరాన్ని (స్వరూపాన్ని) ప్రకాశింపజేస్తుంది గదా!)

ఇక్కడ మనం వ్యాకరణ శాస్త్రవేత్త స్థానంలో శబ్ద సౌందర్యాన్ని ఎరిగిన కవిని గ్రహిద్దాం. మహాకవియైన బాపురెడ్డిగారికి శబ్దం తన అర్థాన్ని సాక్షాత్కరింప జేసింది అనడంలో అతిశయోక్తి లేదు! ఆయన రచనలలో - సహస్రాధిక శీర్షికలతో, పదులకొలది రచనలున్నాయి - ఏది పరిశీలించినా - పద్యంగాని, గద్యంగాని, గేయంగాని, గేయ నాటికగాని - ఈ సత్యం మనకు ప్రథమ దర్శన మిస్తుంది.

"నెదరులాండు"ను గూర్చి వ్రాసినా బెదరుగుండె బిత్తరిని గూర్చి వ్రాసినా, "విపద్గీతి' ' వ్రాసినా, "విశాఖ లేఖ" వ్రాసినా, "విజయ శంఖం" పూరించినా, "ప్రగతిగీతి" పాడినా ఈ కవి - శబ్దం వెనుకదాగి ఉన్న అర్థాన్ని గుర్తించి ప్రదర్శిస్తారు.

ఇదే విధంగా శబ్దార్థాల రెండింటికీ వెనుకనున్న తత్వాన్ని మెచ్చుకొని వ్రాస్తారు. అదే సత్యం! హిరణ్మయమై రమ్యమైన ప్రకృతి వెనుక విహితమై ఉన్న సత్యాన్ని దర్శిస్తాడు. చాలామంది రమ్య ప్రకృతిని చూచి ముగ్ధులై తృప్తి పొందిపోతారు. బాపురెడ్డిగారు ప్రకృతి రమణీయతను మెచ్చుకొంటూనే దాని వెనుక దాగివున్న సత్యాన్ని తాను దర్శించి మనకు చూపిస్తారు. ఇది సామాన్య విషయం కాదు.

ఒకే దైవానికి అనంత రూపాలున్నట్లు వస్తుతః ఒకటే అయిన సత్యానికున్న అనంత రూపాల ప్రదర్శనే "అనంత సత్యాలు" కావ్యంలోని అంతరార్థం. దైవం లాగే సత్యం కూడా-సత్యం, శివం, సుందరం, పరబ్రహ్మతత్త్వం త్రిమూర్త్యాత్మకం అయినట్లే, పరసత్యం కూడా సత్యం శివ సుందరాత్మకం. ఈ మూడింటిలో దేనికి ప్రాముఖ్యమిచ్చి చెప్పినా అన్నీ ఉంటాయి. సత్యం-శివం, సుందరం కాక వీలులేదు; శివం-సత్యం, సుందరంకాక వీలులేదు; సుందరం-సత్యం, శివం కాక వీలులేదు. వీటిలో ఏ ఒకటి మిగిలినవికూడా కాకపోతే, అది అదికాకుండా పోతుంది. అంటే ఏకత్వంలో భిన్నత్వం, భిన్నత్వంలో ఏకత్వం. ఈ పరమ సత్యాన్ని నిష్కర్షగా నిశితంగా "అనంత సత్యాలు" కావ్యంలో కవి ప్రపంచించారు. ఈ సత్యదర్శనం దార్శనిక దృష్టి ఉన్న కవికి గాని సాధ్యంకాదు. అలాంటి కవి మాత్రమే - రసోవైసః సోవైరసఃఅని అనుభూతికి తెచ్చుకోగలుగుతాడు. ఆ కవే ద్రష్ట! ద్రష్ట కానివాడు స్రష్టకాలేడు! దర్శించే శక్తి సృజించేశక్తి ఒకే నాణానికున్న రెండు పార్శ్వాలు. పృథగస్తిత్వం ఏ ఒక్కదానికీ లేదు. ఈ రెండూ అత్యున్నత స్థితిలో ఉన్నవాడే ఋషి కల్పుడైన మహాకవి.

స్వర్ణమయ జగత్తులో పడి పశ్చిమదేశ వాసులు - జన్మతః వారెక్కడి వారైనా-సత్య స్వరూపాన్ని విస్మరిస్తూ ఉంటే ఈ విపశ్చితకవి సందేశాత్మకమైన ఉపాయమానంగా "అనంత సత్యాలు" కావ్యాన్ని "ఉత్తర అమెరికాలోని తెలుగు మహాజనులకు" అంకితం చేశారు (1979). ఇక్కడ "తెలుగు మహాజనులు" పశ్చిమ దేశ వాసులకు ప్రతీకలు. బాపురెడ్డి గారి తాత్త్విక దృష్టికి ఈ కావ్య పరాకాష్ఠ.

చతుర్థి పురుషార్థాలలో - ధర్మానికి గ్లాని లేకుండా అర్థాన్ని, కామాన్ని అనుభూతిలోనికి తెచ్చుకొని నాల్గవ పురుషార్థాన్ని ఆదర్శనంగా పెట్టుకోవడం సందేశాత్మకంగా వివరించడం బాపురెడ్డి గారి రచనలలో కనబడుతుంది. వారి "నాదవేదాలు" అనే కావ్యంలో ఈ విషయమై ఆయన హృదయావిష్కరణ జరిగింది. ఆయననే అక్కడ ఇలా అన్నారు: "ఈ 'నాదవేదాలు' త్రిముఖాత్మకంగా ఆవిష్కృతమైనవి- ప్రణయనాదం, ప్రగతినాదం, ప్రణవనాదం- త్రయీనాద అంతర్వేదసారం ఈ నా కవితాకాసారం." ఇక్కడ కవి ప్రయోగించిన త్రయీనాద, అంతర్వేద సార శబ్దాలు ఆయన ఆలోచనను, దృక్పథాన్ని మనకు వ్యంగ్య ప్రధానంగా చెబుతున్నాయి. ఇదే చతుర్విధ పురుషార్థ సారం. ఇందు వల్లనే ఈ కావ్యాన్ని "తూర్పుదిశలో తేజరిల్లే తెలుగు మహాజనులకు" అంకితం చేశారు.

ఈ రెండు కావ్యాలు-బాపురెడ్డి గారి మేధకు, హృదయానికి పుత్రికలు. ఈ రెండింటిలో కవితా పదార్థం పుష్కలంగా వున్నా "అనంత సత్యాలు" వారి మేధా జన్యమైనది. "నాదవేదాలు" వారి హృదయజన్యమైనది. ఈ రెండింటిలోను సత్య దర్శనమున్నా - ఒకటి తాత్త్వికుని సత్య దర్శనం, ఇంకొకటి కవి సత్యదర్శనం. విమర్శకోసం ఇలా రెండింటిని వేరు చేసుకొని చూచినా, నిజానికి ప్రతి మహాకవిలోను ఈ రెండూ ఉంటాయి.

బాపురెడ్డిగారు స్వస్వరూప విజ్ఞానంఉన్న దార్శనిక కవి గనుకనే "అనంత సత్యాలు" కావ్యాన్ని గురించి ఆయనే ఉత్తమ విమర్శకునిలా, ఆత్మ పరిశీలన చేసుకొని ఇలా అంటారు: "నా కవితా తత్త్వాన్ని, నా రసానంద, దార్శనికత్వాన్నీ అవిచ్ఛిన్న ధారావాహికగా ఆవిష్కరించే భావచిత్రాలు ఈ 'అనంత సత్యాలు'. సాహిత్యం, అందులోనూ కవిత్వం ఏ రాజకీయ సిద్ధాంతానికో, ఏ విజ్ఞానశాస్త్రానికో, ఏ వాదానికో ఊతనిచ్చే చేతికర్రకాదు. ఊడిగంచేసే దాసి కాదు. కవితకు మానవ జీవితంలో ఒక విశిష్టమైన, వైయక్తికమయిన స్వతంత్ర ప్రతిపత్తి ఉందని నా విశ్వాసం" ఇంతకంటే సూటిగా బాపురెడ్డి గారి కవిత్వాన్ని గురించి- ముఖ్యంగా 'అనంతసత్యాలు' కావ్యాన్ని గురించి- ఎవరూ ఏమీ ఎక్కువ చెప్పలేరు!

'అనంత సత్యాలు' కావ్యఖండికలలో ఒక్కొక్క చోట కవి వాక్కు, ప్రమత్తులైన అలసులకు భయం కొలిపేదిగా ఉంటుంది: సర్వజ్ఞత్వం ఆపాదించు

కొని విఱ్ఱవీగుతున్న ఆధునిక మానవునకు వెరపు కలిగించి అతన్ని ఆలోచించేలా చేస్తుంది! ప్రథమంలోనే "అజ్ఞాన జ్ఞానం" అనే శీర్షికలో తన పరిమితత్వాన్ని మనిషి ఇలా గుర్తిస్తాడు :

*"రెండు మార్గాల సంగమం*
*నా మనో మండలం*
*ఉభయజ్ఞానాల "జ్ఞానం"*
*నాకు తెలియదు అనే "అజ్ఞానం"*

సత్యాన్ని గురించి చెప్పేటప్పుడు కవిగా చెప్పడమూ ఉంది. మేధావిగా నిర్వచించడమూ ఉంది. ఒకటి బుద్ధితో చెప్పింది. ఇంకొకటి హృదయంతో చెప్పింది.

*"సత్యం ఒక స్వప్నం*
*స్వప్నం ఒక సత్యం*
*సత్యాలూ స్వప్నాలూ కలిసి*
*నిత్యజీవితాలౌతున్నవి."*

బాపురెడ్డిగారి రచనలలో అడుగడుగున గుండెను గుబగుబలాడించే కవిత్వం ఉంటుంది. సొగసుగా ఊహించడం బాపురెడ్డిగారికి "వెన్నతో బెట్టిన విద్య." మన మందరం రోజూ చుక్కల్ని చూస్తూనే ఉన్నాము. వేయి సంవత్సరాల తెలుగు కవిత్వ చరిత్రలో ఎవన్నారండీ నక్షత్రాల్ని గురించి ఇలా :

*"శూన్యాన్ని శోధిస్తున్న ఆ చుక్కలను చూడండి*
*కాలవ్యాళ సహస్ర ఫణాలలోని*
*విజ్ఞాన మణుల్లాంటి విశ్వచక్షువుల్ని చూడండి*
*కోటి కోటి కాంతి సంవత్సరాలకు అందని*
*కోట్ల కోట్ల చుక్కల్ని చూడండి.*
*కన్నుల్లో క్రమ్ముకున్న కారుమబ్బుల్ని*
*కడిగివేసే ఆ కాంతిబింబాలను చూడండి.*
*దైవత్వం అనంతత్వం కలిసి నిర్మలాకాశంలో కట్టుకున్న*
*భర్మహర్మ్యాల వజ్రస్తంభాలను*
*భావోద్దీప్తులై చూడండి".*

చివరి నాలుగు పాదాలలో మనిషి జీవితాన్ని కళ్ళకు కట్టేటట్లు హృదయానికి హత్తుకొనేటట్లు చెప్పలేదా, కవిగారు? మనిషిని గురించిన సమ్యగవగాహన ఉంది గనుకనే ఆయన "నానా, నాలలో-నానా, నీలలో" మనిషిని చూడగలిగాడు. "అఖిల వేదాలను, సకల వాదాలను వీడి" మనిషిని పఠించడం ప్రారంభించాడు.

ఏ విషయాన్ని ముట్టినా దాన్ని బంగారం చేసే రసవాద విద్య తెలిసిన రసవాదహృదయవేది బాపురెడ్డిగారు అంటే స్వభావోక్తిమాత్రమే అవుతుంది. "జీవితం మహాకావ్యం" అనే శీర్షిక క్రింద వ్రాస్తూ "సుందరతర గందరగోళం జీవితం" అంటారు ఈయన. ఈ పదబంధకల్పన ఎంత సులభ సుందరం! ఈ శీర్షిక క్రిందే "అరిషడ్వర్గాల పందిరి మీద, క్షణానికో పూవు పూచే, చిత్రగంధి జీవితం-ఎక్కడ పుడుతుందో తెలియని, ప్రాయేటి కెరటం జీవితం" అంటారు. తాత్త్వికమైన పునాది మీద కట్టిన భావ సౌధం కాదా ఇది?

"పంచేంద్రియ పథం"లో తాత్త్వికుడు, కవి అహమహమికతో పయనిస్తారు. ఈ శీర్షికలో ప్రతిపాదంలోను విశిష్టత చూపి "జ్ఞానేంద్రియ చోదిత, పంచేంద్రియ రథంలో" మనల్ని "జ్ఞానానందం, భావానందం, జీవానందం" అనే త్రివిధానంద శోభిత ప్రాంతంలో త్రిప్పుతారు కవిగారు. ఇంత గంభీరంగా వ్రాసిన కవే "చెలికాడు చందమామ" లో అతికోమలంగా "మొయిలు బడిలో చందమామ, అమ్మ ఒడిలో నేను కూర్చుని, ఒకరినొకరం పిలుచుకున్నాం, ఒకరిలో ఒకరిని చూచుకుంటూ, ఉప్పొంగే అమ్మ కళ్ళల్లో, ముద్దుగా ఇద్దరం కలుసుకున్నాం" అంటారు.

ఇలా చెప్పుకొంటూపోతే పుస్తక మంతా ఉదాహరించవలసి వస్తుంది. నిజంగా, వెన్నెల లాంటి స్వచ్ఛ కవిత్వానికీ వెన్న లాంటి కవి హృదయానికీ నిదర్శనాలైన కావ్య ఖండికలున్నట్లే; సాగరం గభీరతకూ సమగ్ర దర్శనానికీ ఉదాహరణ ప్రాయాలైనవీ ఎన్నో ఖండికలున్నాయి. "ఏకాంతంలో వేదాంతం" శీర్షికలో బాపురెడ్డిగారు దార్శనిక కవిగా సాక్షాత్కరిస్తారు. ఇందులో "కోహం" అని ప్రశ్నించుకొనే జ్ఞానం, "అహం బ్రహ్మాస్మి" అని తెలుసుకొన్న ప్రజ్ఞానం కవిలో మనకు కనబడతాయి.

ఇలా కవి భావాంబర వీథిలో విహరించినా తాత్త్వికాంబుధిలో ఓలలాడినా ఆధునిక యుగధర్మాన్ని అనుసరించి మనిషిని మరిచిపోకుండా "మనిషిని మించిన మహాశక్తిలేదని, మనిషినే ఆరాధిస్తున్న "మహా మనీషి బాపురెడ్డిగారు.

ఒక్క ముక్కలో చెప్పాలంటే- ఈ మధ్య కాలంలో నేనింత మంచి కవిత్వం తెలుగులో చదువలేదు అంటే చాలదా?

*(రెండవ ముద్రణకు వ్రాసినది)*

**- ఆచార్య కొత్తపల్లి వీరభద్రరావు**

# తొలిపలుకు

(తొలిముద్రణకు వ్రాసినది)

డా॥ బాపురెడ్డి గారి అనంత సత్యాలు ఆద్యంతం చదివాను. దర్శనశాస్త్ర విషయాలు కొంత అధ్యయనం చేసి వాటి అర్థాలను అనుసంధానం చేయనివారు; నానా దేశసంచారం చేసి వాటిలోని ఆచార విచారాలను ఆకళింపు చేసుకోనివారు; లౌకజ్ఞానం, విభిన్న వ్యక్తులతో పరిచయం, పరిపాలనానుభవం, ఆంధ్రభాష మీద అధికారం లేనివారు; ఇలాంటి కవితా రచనం చేయలేరు. వీరి కీసాధన సంపత్తి అంతా ఉండటం చేత, వీరి కవితా పఠనం నాకెంతో ఆమోదం కల్గించింది.

ఆధ్యాత్మిక తాత్త్విక భావాల్ని వీరు సుందరంగాను సున్నితంగాను కొన్ని సందర్భాల్లో వ్యక్తం చేశారు. ఉదాహరణలు :

అంతర్ముఖంగా యోగమార్గం అన్వేషించేది బహిర్ముఖంగా ప్రయోగమార్గం శోధించేది అనంతత్వాన్నే అన్నారు వీరు. (పు.1) స్వప్నాలూ సత్యాలూ కలిసి నిత్యజీవితం అవుతుంది. (పు. 4) అద్వైతం మాయావాదంగాని భావవాదం గాని కాదు, అది “భావ భౌతికవాదం” అట! (పు. 8) మానవ జీవితతత్త్వం ఆనందో న్ముఖత్వం. (పు.69) ఎట్టి ఆశ, కోరిక లేనప్పుడు మనకు కలిగే అనుభవం ఇతరులకు కల్గించలేం; దానికితరులు సాక్ష్యం ఉండరు; ఆ సాక్ష్యంలేని సత్యం సాధిస్తేనే మోక్షం. (పు. 70)

“సాగరాలు, మేఘాలు, స్రవంతులు”-“నదులు, నీరదాలు, నీరధులు”- వీటిని గూర్చిన రెడ్డిగారి కల్పనలు (పు. 32-7) మనోజ్ఞాలు. ఆకలి, ఆశ్చర్యం, ఆలోచన మానవుల్ని ముడివేసే మూడు సూత్రాలని, నరుల్ని నాగరికతల్ని నడిపిస్తున్న మూడు నేత్రాలని వీరి సూక్తి. ఇట్లా చాలా మంది వేత్తల అభిప్రాయాన్ని వీరు రమ్యంగా వక్కాణించారు. భక్తి, జ్ఞాన, కర్మయోగాల ద్వారా సత్యదర్శనం అవుతుందని, కాని తీరికలేని కోరికవల్ల ఆ యోగత్రయం ద్వారా సత్యాలను కనుక్కోవటం సాధ్యం కావటంలేదని– వీరనటం (పు. 88-9) నాకు బాగా నచ్చింది.

సమకాలికాంధ్ర దార్శనిక వచనకవిత్వంలో డా॥ బాపురెడ్డిగారి ఈ సంపుటికి ఉచ్చస్థానం లభిస్తుందని తోస్తుంది. రహస్యవాద ధోరణిని (మిస్టికల్ టెన్డెన్సి), తత్త్వశాస్త్రంతోను ఆధునిక విజ్ఞానంతోను కల పరిచయాన్ని, విమర్శనాదృష్టిని, కవితా పాటవాన్ని సమ్మిశ్రణం చేయటానికి చేసిన సఫల ప్రయత్నం ఇది.

**ఆచార్య కె. సచ్చిదానందమూర్తి**
Chairman, Indian Philosophical Congress
New Delhi

# INTRODUCTION

**Prof. I.V. Chalapati Rao**
*Editor, 'Triveni'*
*Registrar, C.I.E.F.L. (Retd.)*

Writing about poetry is not finding its true meaning but trembling on the brink of finding. It is not the subject that matters. What matters is whether the poet has made poetry of the subject. There can be pedestrian verse and winged prose. Where there is 'feeling, there is language within language-an inner idiom. If requires exploration more than explanation or exposition.

Here is poet Dr. Bapu Reddy whose writings open a new vista with gleams of fine sunshine, shafting through the low clusters of clouds. His poetry is indeed a passion flower of India's ageless culture spreading its petals amidst the disturbing winds of commercialism and corruption, the twin evils of the new millennium. Yester day's absolutes become today's comparatives. Insights mingle with imagination. From start to finish, sparks fly from the smouldering furnace of his prose-poetry under the sculpturing of deep experience and fecund imagination, and he has succeeded in catching them and finding them a habitation before they got extinguished.

The very title of the slim volume 'Ananta Satyalu' unevils the poet's philosophy of life, rooted in our timeless scriptures and spiritual heritage. It is the secularised essence of the world's great religions whose teachings, wind and wind towards the simple creed of being kind. Humanism is the modern name for it.

We, find the poet's mind cruising between divinity, 'Infinity' and 'Bliss' (Ananda Brahma) and eventually anchored in Man. The proper study of mankind is man. The poet declares 'I worship man because there is no higher power than man 'page 113'. Setting aside the Vedas and the doctrines of philosophy he proposes to study and explore man - the inner and the outer man. This is what Swami Vivekananda, the modem monk had

said: "No books, no scriptures, no science can explain the glory of the Self that appears as man, the most glorious God that ever was, the only God, that ever existed, exists or ever will exist."

In the poet's creative imagination, life itself is a romantic idyle - a great classic. With its entrances and exits and the manifestation of heavy passions (Arishad Varga), Life is a colourful pageant, a passing show. The miracle of birth, the mystery of death and the meaning of life are the fit subjects for the poet to probe. In his unceasing quest for truth, he discovers facts everywhere, confirming what Rabindranath Tagore said: "Truth is a combination of facts.... truth comes as a conqueror if we fail to receive him as a guest."

In one of his philosophical pieces 'Panchendriya Radham' man rides the chariot of the five senses without trying to understand the purpose of life. One should care to know who is the charioteer and what is the destination. Otherwise he is not a living person, not even the occupant but merely the cargo ñ jetsom and flotsom. According to the poet, life's purpose is bliss and it is the trinity of "Jnananda, Bharananda and Jeevananda". Truth, goodness and beauty are the navigational guides to reach the heaven of bliss. Yet there should be no illusion that heaven is in outer space and that one could get it some time in the fictionary future. Heaven or hell is a mental condition. It is here and now. This is the poet's discovery on the basis of the triple action of self confrontation, self-awareness and self-investment.

Bapu Reddy is a high priest at the altar of Beauty and a Wordsworthian worshipper of Nature. He perceives civilisation growing on the banks of rivers and the coasts of seas. In his truly international outlook, a spirit of universality flows in all the rivers of the world - the Ganga, the Godavary, the nile and the Rhine. As a practical idealist he believes that God's pleasure is in doing service to man, and service to man is service to God. Inspite of his vedantik view of life, he is a man of deep loyalties and domestic pieties His feeling reference to his mother shows his reverence for her. He expresses his keen

appreciation of the fine arts and particularly music, the queenliest of them.

Besides, we find in his poems a spirit of alternation between contemplation and action with a desire to enjoy life without selling himself to it. Respect for tradition controls and channels passion. He sees diversity in unity. The infinite is perceived within the forms of the finite. Spirit is in the matter and God is in man. His imagination enables him to see "the world in a grain of sand, heaven in a wild flower and aternity in an hour."

The poet's being is an unfinished statue. As love and Vedanta chiselled him, he has awakened to the nuances of the inner life. He manifest it in his poems.

The book is a unique production. It deserves to be on the shelves of all libraries, public and personal.

***

# AN APPRECIATION

To make itself living and effective any metaphysical doctrine or philosophic idea should incarnate as imagination, poetic truth or significant symbol and image. This miracle has been successfully achieved in a sustaining manner by my poet-friend Shri J. Bapu Reddy in his collection of poems Ananta Satyalu. Embodying his ideas in poetic forms is not fully satisfying for him; he goes further and transforms them into deeper passions. For, verily they are his dreams, his dream-children, his subtle and profound experiences. His imagination often fuses with his longing and together with his capacity of luminous rasa, produces poetry of a very high quality.

His mind's journey lies through cosmic kingdoms of life's secrets, and taking the heart's aspiration as his constant comrade and guide, he seems to cross the twilight of dry Reason, and enter the soft twilight of his final Ideal.

Ignorance, in its endless seeking, says the poet, has discovered two wonderous truths-Godhead and Infinity. For the self-realising theist the ultimate experience is of Infinity. Yoga and scientific enquiry are the two different ways leading respectively to the two goals.

The search after the Supreme Person and the sense of a secret immortality of the Infinite have been the earliest as well as the ultimate preoccupation of man. The former is realisable by the revolutionary individual effort, and the latter attained by an evolutionary general progression.

What you see is not the Truth, says Tagore, but what is Truth the eyes cannot see. To our poet, Truth is one dream, dream is yet another Truth; together truths and dreams become our daily lives.

In the virtuosity of his poetic style and in the consummate artistry of words one can clearly see his lyric genius.

**Dr. V. MADHUSUDAN REDDY**
Professor of Philosophy, Osmania. University.

(Extracted from his message on the occasion of Literary Silver Jubilee of Shri Bapu Reddy in 1980)

# ఇందులో . . . . .

# బాపురెడ్డి గారి మరికొన్ని రచనలు

బాపురెడ్డి గేయ నాటికలు
శ్రీకార శిఖరం *(గేయ సంపుటి)*
నా దేశం నవ్వుతూంది *(గేయ సంపుటి)*
ప్రేమారామం *(గేయ సంపుటి)*
మనసులోని మాట *(వ్యాస సంపుటి)*
ప్రణవ ప్రణయం *(వచన కవిత)*
మన చేతుల్లోనే ఉంది *(వచన కవితలు)*
రంగు రంగుల చీకట్లు *(వచన కవిత)*
వాడిపోని వసంతాలు
కాలం మాయాజాలం *(వచన కవిత)*
బాపెరెడ్డి భావగీతాలు *(గేయ సంపుటి)*
సౌదామినీ కవితలు
హృదయ పద్యం *(పద్య కవిత)*
ఆత్మీయరాగాలు
జీవనశ్రుతులు *(పద్య కవిత)*
ఆటపాటలు *(గేయ సంపుటి)*
అక్షరానుభూతులు *(వచన కవిత)*
పద్యాల పల్లకి
నవగీత నాట్యం

***ఆంగ్ల కవితలు***

In Quest of Harmony
Longing for Life
Urn of Love
Loving is Living
Anatomy of Time
Verities and Visions

జె. బాపురెడ్డి

# అజ్ఞాన జ్ఞానం

అజ్ఞానం కనిపెట్టిన
అద్భుత సత్యాలు రెండు -
ఒకటి దైవత్వం
రెండవది అనంతత్వం.
ఎప్పుడు పుట్టిందోకాని
మానవ నాగరికత
ఇప్పటి కది సాధించిన
అంతిమ విజయా లివి -

ఆత్మజ్ఞానానికి
అవతలిగట్టు దేవుడు;
పదార్థ జ్ఞానానికి
ఆఖరిమెట్టు అనంతత్వం.
అంతర్ముఖంగా
యోగమార్గం
అన్వేషిస్తున్నది దైవత్వాన్ని;
బహిర్ముఖంగా ప్రయోగ మార్గం
శోధిస్తున్నది అనంతత్వాన్ని;
రెండు మార్గాల సంగమం
నా మనోమండలం
ఉభయ జ్ఞానాల "జ్ఞానం"
నాకు తెలియదు అనే "అజ్ఞానం".
అజ్ఞానమే దైవత్వం
అజ్ఞానమే అనంతత్వం

అజ్ఞాన తిమిరంలో దాగిన
అందాల సత్యాలను
ఏరుకుంటున్న పైరుపాటను నేను
సాక్ష్యంలేని
శాశ్వత గుప్త సుప్త సత్యాలకు
సాక్షిని నేను -

దైవత్వం, అనంతత్వం
నన్ను దహించి వేస్తున్నవి
అనుభూతుల అమృతత్వం నన్ను
అక్షరాల వెలిగిస్తున్నది
అగణిత జీవిత సత్యాలు నాలో
ఆవిష్కృతమౌతున్నవి
దేశ కాలాలు నాకళ్ళకు
దివిటీలు పడుతున్నవి.

# ఆహ్వానం

అగుపించే వాస్తవాల వెనక
అనుభూతి సత్యాలను చూపిస్తాను
అగుపించని అనంతత్వంలోని
ఆనంద తత్త్వాన్ని ఆవిష్కరిస్తాను.
రండి, - అందరూ రండి!
నా
కవితా సత్య సాక్షాత్కారం కోసం
కల్పనాసత్య సత్కారం కోసం-

ఎంత త్రాగినా తనివితీరని
వింత రసామృతాస్వాదనకు
ఏ విజ్ఞాన శాఖ విరియలేని పరిమళోపాసనకు
రండి! ఇంకా దగ్గరగా రండి!!
లోనికి.... లోలోనికి
నా గుండెలోనికి రండి!

అనంతాకాశాన్ని కొలిచే
నా అక్షర చక్షువుల్లోనికి రండి!
గాలి తీగల మీద గాంధర్వం పలికించే
నా అంగుళీ కళాస్థానంలోనికి రండి!
మనిషికీ మానవతకూ
చేతనా కేతనం కట్టి
సిసృక్షాహారతులు పట్టే
నా అనుభూతి గీతుల్లోనికి రండి !!

# ఏది సత్యం ?

మనకు కనిపించేది సత్యం కాదని
మాయావాది వాదం;
మరి మనకు కనిపించనిది సత్యం ఎలా అవుతుందని
హేతువాది ప్రశ్న.

సమయ సత్యాలేకాని శాశ్వత సత్యాలు లేవు;
మనం ఒక సత్యం
మాయ కూడా ఒక సత్యం
ఏది సత్యం కాదనుకున్నప్పుడు
అన్నీ సత్యాలే అవుతాయి.

సత్యం ఒక స్వప్నం
స్వప్నం ఒక సత్యం
సత్యాలూ స్వప్నాలూ కలిసి
నిత్య జీవితాలౌతున్నవి.

భావనాత్మకమైంది సత్యం
ప్రయోజనాత్మకమైంది సత్యం
ఆలోచనా పరం సత్యం
అనుభూతి వరం సత్యం-

ఎర్ర గులాబీలో ఏముంది?
ప్రేయసి హృదయం ఉంది - ఒక సత్యం
ఆకలితో మండుతున్న
పేదవాని ఆవేశం ఉంది - మరొక సత్యం
ముళ్ళను కాలదన్నిన
ముగ్ధ సౌందర్యం ఉంది - ఇంకొక సత్యం

ఏ క్షణంలోనో ఆరిపోయే
దీపకళిక ఉంది - వేరొక సత్యం
ఒకటి సత్యం కావటంవల్ల వేరొకటి అసత్యంకాదు.

కళ్ళు కల్పిస్తాయి సత్యాన్ని
బుద్ధి కల్పిస్తుంది సత్యాన్ని
అవసరం కల్పిస్తుంది సత్యాన్ని
అందుకే, ఒకే వస్తువులో రకరకాల సత్యాలు
సత్యాలన్నీ కల్పితాలే
సత్యాలన్నీ శాశ్వతాలే.

ప్రయోజనపరమైంది సత్యం.
పూలు ప్రేమికుడికి
ప్రియురాలి చిరు నవ్వుల పంటలు;
పేదవానికి అవి ఫలించని ఆశాబీజాలు.
అదుగో! ఆ శిలను చూడు
అందులో సంకల్పబలం ఉంది
తరతరాల చరిత్ర ఉంది
తల పగులగొట్టే కరుకుదనం ఉంది
తరుణి కళ్ళల్లోని చురుకుదనం ఉంది
ఏముందో చూపించేది
కాల్పనిక సత్యం - భావనాసత్యం
కావలసిన వానికి అది కనిపిస్తుంది.

ప్రయోజనం లేకపోతే
మట్టి అయినా మాణిక్యమైనా ఒకటే;
అన్ని సత్యాలను దర్శించు
అవసరమైనదాన్ని హర్షించు
స్పర్శించు, స్వీకరించు-అనుభవించు, ఆనందించు
అనంతత్వంలోనికి పయనించు.

# చుక్కలను చూడండి

ఏ అగుపించని అసత్యాలో
ఆకాశంలో ఆరబోసినకొన్న సత్యాలు
అగణిత నక్షత్రాలు
నక్షత్రాలంటే నాకు చెప్పలేనంత ప్రీతి.
ఉడులముడులు విప్పటం
నేను ఉగ్గుతో నేర్చిన విద్య
నక్షత్రాల సోపానాల మీదనే
నా ఊహల రాకపోకలు.
చుక్కల్ని చూడకపోతే నేను ఒక్కరోజైనా బ్రతకలేను
అన్ని ప్రశ్నలకూ
నా ఆఖరు సమాధానాలు అవే!
పేరుకు ఇక్కడ ఉంటానేగాని
తారాపథ విహారం నాది.

ఎక్కడో ఉన్న చుక్కల్ని చూస్తుంటే
రెక్కలు మొలుస్తాయి నాకు;
ప్రక్కవాని మాట పట్టించుకోనని
ఎదుటివాని గోల వినిపించుకోనని
పరధ్యానంలో ఉంటానని
నా ప్రాణమిత్రులు విసుక్కుంటారు.

చూడండి, లోతుగా చూడండి!
శూన్యాన్ని శోధిస్తున్న ఆ చుక్కలను చూడండి
కాలవ్యాళ సహస్రఫణాలలోని

విజ్ఞాన మణుల్లాంటి
విశ్వ చక్షువుల్ని చూడండి
కోటి కోటి కాంతి సంవత్సరాలకు అందని
కోట్ల కోట్ల చుక్కల్ని చూడండి
కన్నుల్లో క్రమ్ముకున్న కారుమబ్బుల్ని
కడిగివేసే ఆ కాంతి బింబాలను చూడండి
దైవత్వం అనంతత్వం కలిసి
నిర్మలాకాశంలో కట్టుకున్న
భర్మహర్మ్యాల వజ్రస్తంభాలను
భావోద్దీప్తులై చూడండి.

# నరులే నక్షత్రాలు

నరులకూ నక్షత్రాలకూ
నామ మాత్రమే తేడా
నా దృష్టిలో,
నా కవితా సృష్టిలో.

నరులు నక్షత్రాల భాష
నక్షత్రాలు నరుల భావం.
భావంలేని భాషకు జీవం లేదు
భాషలేని భావానికి జవం లేదు.
నరులు లేకుంటే
నక్షత్రాలకు విలువ లేదు
నక్షత్రాలు లేకుంటే
నరులకు చలువ లేదు;
అందుకే నక్షత్రాలు
నరుల జీవిత రథచక్రాలు.

నరులన్నా నక్షత్రాలన్నా
నాకు ఎక్కడలేని మక్కువ;
నరులకూ నక్షత్రాలకూ మధ్య
వాసనా తంత్రుల్ని మీటే
భావోన్మాదిని నేను!

చుక్కతో చుక్కను గుణించి
శూన్యాన్ని కొలుద్దాం!
మనిషితో మనిషిని తూచి
పూర్ణానందం పొందుదాం !!

జె. బాపురెడ్డి

# భావ భౌతికాలు

మనకు కనిపించే
చరాచరాలు - సృష్టిలయాలు
భావం వెలిగించే భౌతిక రూపాలు
"గజం మిధ్య పలాయనం మిధ్య" అంటూ
గండం తప్పించుకున్న జగద్గురువు వాదం
మాయావాదం కాదు, భావవాదం -
అదీ కాదు, నిజానికి భావభౌతిక వాదం.
అంటే భావాన్నీ బట్టి భౌతికం
ఆలోచననుబట్టి అనుభూతి.

ఎక్కడా ఏదీలేదు
అంతటా అన్నీ ఉన్నాయి.
తల్లి లేదు తనయ లేదు
భార్య లేదు భర్త లేడు
అక్క లేదు అన్న లేడు
అవన్నీ వట్టి భావనలు
భావం మనిషిలో ఆపాదించే భౌతిక ముద్రలు వారు
స్వప్రయోజనంకోసం
భావం అల్లుకున్న వాస్తవికతలు
భావ భ్రమర భ్రమా భ్రాజితం భౌతికలోకం.
అందుకే
మంచి భావాలు పండిద్దాం
మధుర భావాలు పండిద్దాం
అఖిల సృష్టిని ఆనందప్లావితం చేసే
అమృత భావాలను పండిద్దాం!
భావవాద భౌతికవాద సరస సమ్మేళనంలో
ఆనంద బ్రహ్మను దర్శిద్దాం !!

# ఆనందో బ్రహ్మ

ఆనందం!
ఏమిటి ఈ ఆనందం అన్నట్లు
ఎక్కుపెట్టిన మీ భ్రుకుటాలు
కదిలిస్తున్నవి నాలో
కమనీయ భావశకటాలు.

ఆనందం జీవిత లక్ష్యం
ఆబాలగోపాలానికి
ఆనందోన్ముఖత్వం
మానవ జీవితతత్వం
ఆనందం ఆనందమే - అనిర్వచనీయం.
అందుకు సాధనాలు
అనేకానేకం - నిర్వచనీయం.

ఆనందం ఒక అనంత సత్యం
అప్పుడది దైవత్వం
ఏతన్మహా సాధనం
భావ జవసత్వం

ఆనందం బ్రహ్మస్వరూపి
బ్రహ్మ భావస్వరూపి
భావ బ్రహ్మోపాసనకై
బయలు దేరండి !
ఆనంద బృందావనంలోనికి
అడుగిడుదాం రండి !!

జె. బాపురెడ్డి

## మనిషినుంచి ప్రారంభిద్దాం

ఎక్కడినుంచి ప్రారంభిద్దాం యాత్ర
మనిషినుంచి - మనస్సునుంచి - మననుంచి
ఎవరీ మనిషీ ?
ఎప్పుడు పుట్టాడు?
ఎలా పుట్టాడు? ఎందుకు పుట్టాడు?
మనల్ని మనమే అడుక్కునే
మౌలిక ప్రశ్న లివి
మూడు కాలాలను ముడివేసే
ముచ్చటైన మూడు ప్రశ్నలు అవి.
నరదాగా అగుపించినా
సమాధానం లేని ప్రశ్న లివి.

దేవుడు వేసిన ప్రశ్న మనిషి
మనిషి చెప్పిన జవాబు దేవుడు.
ఎవరీ మనిషి? - మళ్ళీ అదే ప్రశ్న
తన్ను తాను ప్రశ్నించుకునేవాడు మనిషి
తన్ను తాను దూషించుకునేవాడు
తన్ను తాను భూషించుకునేవాడు మనిషి

భిన్నత్వంలో ఏకత్వం మనిషి
ఏకత్వంలో భిన్నత్వం మనిషి
ఔనన్నది కాదని, కాదన్నది ఔనని
అస్తి నాస్తి వాదాలకు దిగి

తన్ను తానే శిక్షించుకుంటాడు
తన్ను తానే రక్షించుకుంటాడు మనిషి
క్షణికమైన తన జీవితంలో
శాశ్వతానందాలముడివిప్పుతాడు
శాశ్వతమైన తన జీవితాన్ని
క్షణికానుభూతులతో ముడివేస్తాడు మనిషి
ఎవరీ మనిషి? ఎడతెగని ప్రశ్న
మనిషిని గురించి ఆలోచించే కొలది
మతిపోతుంది.

జె. బాపురెడ్డి

# మనిషిని చదువుతున్నాను

మనిషిలోనుంచి పుట్టిన
మనిషిని నేను
మనుష్యుల మధ్య పెరుగుతున్న
మనిషిని నేను
మనిషిని చదువుతున్న
మనిషిని నేను
మనిషిచే చదువబడుతున్న
మనిషిని నేను
మనిషిని మించిన
మహాశక్తి లేదని
మనిషినే ఆరాధిస్తున్న
మనిషిని నేను -

మా పల్లెలో చూశాను మనిషిని
మహానగరాల్లో చూశాను మనిషిని
నా భాషలో
నా రాష్ట్రంలో
నా దేశంలో
చూశాను మనిషిని
నానా, నాలలో
నానా, నీలలో
చూశాను మనిషిని-
విదేశాల్లో, విభిన్న భాషల్లో
వివిధ వేషాల్లో చూశాను మనిషిని
ఎంతకూ అంతు చిక్కని
వింత మనిషిని -

ఎన్నిసార్లు చూసినా
ఎన్ని తీర్లు చూసినా
సుపరిచితుడైన మనిషే
అపరిచితుడౌతున్నాడు.

అయినా నాలో, నీలో, లోలో
నిత్యజీవితంలో
సత్యజీవితంలో
ప్రత్యక్షమవుతున్నాడు
మనిషి -

సృష్టి కంతటికీ
సంక్షిప్త రూపం మనిషి
భిన్నశక్తుల కేంద్ర బిందు రూపం మనిషి

అందుకే, అఖిల వేదాలను
సకల వాదాలను వీడి
మనిషిని పఠిస్తున్నాను
నన్ను నేను తరుస్తున్నాను
నిన్ను నాలోనికి పిలుస్తున్నాను
నేను నీలోనికి వస్తున్నాను -

అదుగో! మళ్ళీ మీ కళ్ళల్లో
మౌన ప్రశ్నలు మెరుస్తున్నాయి
“ఎక్కడి నుంచి వస్తున్నాడు మనిషి
ఎక్కడికి పోతున్నాడు” అని
నన్ను నిలదీసి అడుగుతున్నాయి
“అనాది కొస నుంచి అనంతత్వంలోనికి”
ఔనంటే అర్థం కాదు
కాదనడానికి కారణం లేదు
అర్థం ఏదైనా ఉందేమో
ఆ తర్వాత ఆలోచిద్దాం -

జె. బాపురెడ్డి

# జీవితం మహాకావ్యం

ఎక్కడి నుంచి వచ్చి
ఎక్కడికి పోతున్నాడో
ఎవరికీ తెలియని
మనిషి జీవితం ఒక మహాకావ్యం
జీవితం ఒక నిత్య సత్యం
అయినా అది మహా స్వప్నం -

బాల్య యౌవన వృద్ధాప్యాలు
రుజా జరామరణాలు
రాగ ద్వేషాలు - త్యాగ భోగాలు
అల్లుకున్న
సుందరతర గందరగోళం జీవితం
అనుభవించతడం తప్ప
అర్థం చెప్పరానిది జీవితం
రండి చూద్దాం జీవితాన్ని
రంగు రంగుల సింగిణిని -

ఎన్నో వికీర్ణ వర్ణాల ఏక రూపం జీవితం
కామ క్రోధ లోభ
మోహ, మద, మాత్సర్యాది
అరిషడ్వర్గాల పందిరి మీద
క్షణానికో పూవు పూచే
చిత్ర గంధి జీవితం -
ఎక్కడ పుడుతుందో తెలియని
ప్రాయేటి కెరటం జీవితం.

# జీవనగీత

జీవితం
జనన మరణాల మధ్య
కాలం వ్రేలాడగట్టిన
కాంతి రేఖ
జననం ఒక మరణంలేని ప్రశ్న
మరణం ఒక జననంలేని ప్రశ్న
సమాధానం లేని రెండు
సంపూర్ణ ప్రశ్నలకు
సమాదానం చెప్పడానికి
సందేహాల బోనులో నిలబడ్డ
సాక్షిలాంటిది జీవితం
అబద్ధం చెప్పదు
సత్యం తెలియదు
ఎన్ని జీవితాలు !
ఎన్నెన్ని సాక్ష్యాలు !
కళ్ళులేని కాలం
చెవులు లేని కలంతో
నోరులేని కాగితంమీద
కన్నీటి అక్షరాలతో
అన్నీ వ్రానుకుంటున్నది
అయినా తీర్పు లేదు
అభియోగంలో మార్పు లేదు.

జననానికి మరణం శిక్ష
మరణానికి జననం శిక్ష
ఉభయ శిక్షలను తానే అనుభవించే
న్యాయమూర్తి జీవితం.

జననం ఒక మధుర రహస్యం
మరణం ఒక విధుర రహస్యం
రెండు రహస్యాల వైపు రెక్కలు సాచి
పరుగెత్తే పక్షి జీవితం
ఊహల వెంట.పరుగెత్తే వాస్తవం జీవితం
వాస్తవ పంజరంనుంచి
పారిపోయే ఊహాశారిక జీవితం -

జననం కేంద్ర బిందువు
మరణం పరిధి
మానవ జీవిత వృత్తంలో
ఏ దిశగా పోయినా
ఏ యాత్రలో ఏ పాత్రగా సాగినా
పరిధిలో విలీనం కాకతప్పని
ప్రాణ బిందువు జీవితం -
అనంత తిమిర సాగరంలోని
అద్భుత ద్వీపం మీద
మబ్బులా వచ్చి కురిసి
వాగులా సాంగి పారలి
వారాశిలో కలిసి పోయే
వర్ష బిందువు జీవితం -

అనుభూతి శిఖరాలనుంచి
అవలోకిద్దాం జీవితాన్ని
ఆలోచనా అంతరాళాలనుంచి
పరిశీలిద్దాం జీవితాన్ని -
అనంతత్వ కిరణాలలో
దైవత్వ దర్పణాలలో
దర్శిద్దాం జీవితాన్ని
రండి! భయపడకండి
రండి! మీలోనికి మీరు రండి -

# పంచేంద్రియ పథం

పంచేంద్రియ పథం మీద
పయనిస్తున్నాం మనం
పంచేంద్రియ రథం మీద
పయనిస్తున్నాం మనం
పంచేంద్రియ సుఖాలను వరిస్తున్నాము
పంచేంద్రియానుభూతిలో పరవశిస్తున్నాము
పంచేంద్రియ పథ దర్శని
పంచేంద్రియ రథ సారధి
ఎవరు?
జ్ఞానేంద్రియ గోపాలుడు -

జ్ఞానేంద్రియ చోదిత
పంచేంద్రియ రథంలో పయనించే
మానవ జీవిత పరమార్థం ఏమిటి?
ఆనందం-త్రివిధానందం-
జ్ఞానానందం
భావానందం
జీవానందం.
"భజ ఆనందం భజ ఆనందం
ఆనందం భజ మూఢమతే"
ఆనందం గోవిందం అయింది
ఆదిశంకరుని పారవశ్యంలో
ఆనందమే గోవిందం
ఆనందమే అనంతత్వం.

ఆకలి, ఆవేదన-కష్టాలు, కన్నీళ్లు
భయం, భ్రాంతి-చీకటి, శిశిరం

స్వార్థం, ద్వేషం
రాలి పోయిన చోట చివురిస్తుంది ఆనందం.

దేహం ఆనందాన్వేషి
మనస్సు ఆనంద పిపాసి
బుద్ధి ఆనందోపాసి
త్రివిధానంద సమాధి జీవిత పరమావధి.

సత్యం, శివం, సుందరం
అవే-ఆనంద దీపాలు
ప్రతి ఒక్కటికి కోటి కోటి రూపాలు.
ఈ లోకంలో - ఈ జీవితంలో - ఈ సమయంలో
లేని, పొందలేని ఆనందం
మరో లోకంలో - మరో జీవితంలో - మరో కాలంలో
పొందుతా మనుకోవడం ఇహపర భ్రాంతి.
ఇక్కడ నీవు అనుభవించలేంది
మరెక్కడా అనుభవించలేవు.

ఆనందం బహిర్ముఖి
ఆనందం అంతర్ముఖి
ఆనందం ఊర్ధ్వముఖి
ఆనందం చతుర్ముఖి.
ఒరుల ఆనందాన్ని త్రుంచే నీ ఆనందం
ఉభయ మారకం!
ఒరుల ఆనందాన్ని పెంచే నీ ఆనందం
ఉభయ తారకం!
ఉభయ తారకపథంలో ఉర్విని దర్శిద్దాం
మా ఊరినుంచి బయలుదేరి
మానవలోకమంతా స్పర్శిద్దాం.

# మా ఊరు మీ ఊరే

మనిషికి మనిషికి
తేడా లేదు
మా ఊరికి మీ ఊరికి
తేడా లేదు
మనస్సు ఉన్నవాడికి
మమత ఉన్న వాడికి
చూపు ఉన్న వాడికి
స్ఫూర్తి ఉన్నవాడికి -

మా ఊళ్లో పుట్టకుంటే
నేను ఏ ఊళ్లోనో
మీ ఊళ్లోనో
పుట్టేవాడినేగా !
అందుకే
మా ఊరు మీ ఊరే
అంటున్నాను
సరసానికి కాదు సుమా
సత్యానికి అంటున్నాను -
అప్పుడే ఒక క్రొత్త సత్యాన్ని
ఆవిష్కరించాం,
అనుకోకుండానే
మా ఊరును మీ ఊరిలో
దర్శించాం !

జె. బాపురెడ్డి

# చెలికాడు చందమామ

మా ఊరు నేర్పింది నాకు
మాటలు, ఆటలు, పాటలు
మా ఊరు నేర్పింది నాకు
మమతలు, ఊహలు, ఆశలు
అమ్మ ఒడిలో కూర్చుని
చందమామ రావే అంటూ
చదువు ప్రారంభించినపుడే
మింటికీ మంటికీ మధ్య
ఇంటికీ ఇంటికీ వలె
అట్టే దూరం లేదనుకొని
ఆనందించాను.

మెయిలు ఒడిలో చందమామ
అమ్మ ఒడిలో నేను కూర్చుని
ఒకరి నొకరం పిలుచుకున్నాం
ఒకరిలో ఒకరిని చూచుకుంటూ
ఉప్పొంగే అమ్మ కళ్లల్లో
ముద్దుగా ఇద్దరం కలుసుకున్నాం
చుక్కలను లెక్కబెట్టుకుంటూ
శూన్యంలో వెన్నెలగూళ్ళు కట్టాం

చెట్టుకొమ్మ మీద శశి
పిట్ట గోడ మీద నేను
విలాసంగా తిష్టవేసి
వెన్నముద్ద లారగించాం.

చెట్టుకొమ్మ చేతుల్లో వాడు
అమ్మ చేతుల్లో నేను
సరదాగా
ఊయాల జంపాల లూగాం
'అనంతగిరి' భుజాలమీద జాబిల్లి
'సిరికొండ' శిఖరం మీద నేను
ఆడుకుంటూ పాడుకుంటూ
అనురాగాలు పెంచుకున్నాం

బాల్యంలో చివురించిన
మా బంగారు చెలిమి
యౌవనంలో పుష్పించి
ఈనాడు ఫలిస్తోంది
ఈనా భావప్రబంధంలో -

చిన్ననాటి నుంచి నేను
చెలిమిచేసిన చందమామ
ఊరు విడిచి వచ్చింతర్వాత
దూరమై పోతున్నాడనుకొని
రాకెట్టు రాయబారం పంపి
ఆకట్టు కొన్నాను మళ్ళీ -

అందాల ఇందన్న ఇంటికి
ఆత్మీయుడు
ఆంస్ట్రాంగ్ వెళ్ళినప్పుడు
నిజానికి శశి అప్పుడు నా దగ్గరే ఉన్నాడు

అర్ధరాత్రి నన్ను నిద్రలేపి
ఆనందలహరి పాడాడు
మబ్బులు క్రమ్మిన మహాబిలంవైపు
అతనికోసం మీరంతా చూస్తుంటే
గుట్టుగా నా గుండెలో దాక్కుని
గుసగుసలు పెట్టాడు -

సృష్టి రహస్యాలమీది
చీకటి తెరలు తొలగిస్తానని
మానవ కళ్యాణానికి మార్గం చూపిస్తానని
చక్కని చిక్కని చుక్కల సంగీతం వినిపిస్తానని
చక్కిలిగింత పెట్టాడు.

# పరస్పరోపమ

చంద్రునికీ నాకూ
చెప్పలేనన్ని పోలికలు
చీకట్లను చీదరించుకొనే
చిత్త వృత్తి మాది.
పరావృత్తిని కాంక్షించే
ప్రవృత్తి మాది,
ఆకాశయానం అంటే
అలసటలేని
ఆవేశం మా ఇద్దరిది -
ఇద్దరమూ
స్వచ్ఛంద జీవన తటాకంలో
ఆత్మ దర్శనం చేసుకుంటాం
ఇద్దరమూ సరస సాగరులమే
సాగర హృదయ సంస్పందనలమే
ఇద్దరమూ తారాప్రియులమే
ఇద్దరమూ కల్హార కాంతులమే -

పల్లెల కళ్ళల్లో
ఆశలు పండించే
ప్రభాహాలికులం మేము
గ్రామసీమల కంఠాలలో
క్రాంతి మల్లికా మాలలు వేసే
విప్లవ వైతాళికులం మేము
అందుకే,
మా ఇద్దరి స్నేహం
తనివి తీరని దాహం.

జె. బాపురెడ్డి

# అమ్మ చేతి బొమ్మ నేను

ఎన్ని రాగరేఖల్ని కూర్చి
ఎన్ని ఆశా తైలవర్ణాలు చేర్చి
తన రమ్యరహో గర్భంలో
అమ్మ
నన్ను చిత్రించుకుందో కాని
ఎద కదిలితే చాలు ఎగసి పోతాను నింగికి.
సృష్టి రహస్యం తెలిసిన అమ్మ
సృష్టించిన బొమ్మ నేను
సృష్టి రహస్యాల్లో చొరబడే దృష్టిగల ద్రష్ట నేను
పుట్టినప్పటి నుంచి నేను
కట్టుకున్న పిచ్చుక గూళ్ళల్లో
ఆరని అద్భుత సత్యాలను
అవలోకించే స్వాప్నికదృష్టి నేను

చదువురాని సరస్వతి మా అమ్మ
ధనంలేని మహాలక్ష్మి మా అమ్మ
సహృదయతా సరస్వతి ఆమె
అనురాగాల ఆరామలక్ష్మి ఆమె
మూగవడ్డ గొంతుకల్లో మోహనరాగం మ్రోయిస్తుంది
శిశిర జీవిత లతల మీద సిరి నవ్వులు పూయిస్తుంది
లోకంమీద తన కున్న ప్రేమను
నా కళ్ళల్లో దాచుకుంది
ఆనంతత్వ ఆరాధనలో నన్ను హారతిగా పట్టుకుంది
ఆత్మీయతా సూత్రంమీద అంతరిక్షంలోనికి
అమ్మ ఎగరవేసిన పతంగు నేను
విజ్ఞాన విహాయస ప్రేంఖణ ఉవజ్ఞా విహంగం నేను.

# చిన్ననాటి జ్ఞాపకాలు

చిన్న నాటి జ్ఞాపకాలలో
చిన్మయత్వం పొందుతున్నాను
మాఊరి మధుర స్మృతుల్లో
తన్మయత్వం చెందుతున్నాను -
ఎప్పుడో పోగొట్టుకున్న బాల్యాన్ని
ఇప్పుడు వెదుక్కుంటున్నాను
విజ్ఞాన విపణి వీధుల్లో వెర్రినై విక్రయించిన
విప్లవాత్మక బాల్యోహల్ని మళ్ళీ
వినువీధుల్లో కొనుక్కుంటున్నాను.

చితికిపోతున్న జీవితంలో
బ్రతికి పోయిన బాల్యంకోసం వెతుకుతున్నాను.
బాల్యాన్ని బ్రతికించేది అమ్మ
అందుకే, అమ్మకోసం వెతుకుతున్నాను
అనురాగం అమ్మ - మమకారం అమ్మ
క్షమ అమ్మ - శ్రమ అమ్మ
త్యాగం అమ్మ - తాదాత్మ్యం అమ్మ
ఎక్కడున్నావు అమ్మా! అంటూ
దిక్కులన్నీ వెదుకుతున్నాను
అమ్మరూపం కనిపిస్తే చాలు
అర్భకుణ్ణయిపోతున్నాను
అమ్మగొంతు వినిపిస్తే చాలు
ఆనందవర్ధనుణ్ణయిపోతున్నాను -
మాతృభావత్వారాధనలో మళ్ళీ మళ్ళీ జన్మిస్తున్నాను
బాల్యజీవితానుభూతిలో మృత్యువును జయిస్తున్నాను.

# అసూయ అభయ మిచ్చింది

అసూయ నాకు విషంపెడుతుందని
అమ్మ హెచ్చరించింది
ప్రేమతో ఆడుకునే నన్ను -

నేరుగా అసూయదగ్గరికే వెళ్లి
నిలదీసి అడిగాను
'ఔనా! ఓ అసూయా
నాకు నీవు విషం పెడతావని
అమ్మ చెప్పింది నిజమేనా?
నీ వద్దకు పోవద్దంది
నీ మాట నమ్మవద్దంది
మా అమ్మ -

అయినా
ఎందుకు పెడతావు విషం నాకు?
ఏమిటి నామీద కసి నీకు?
అసూయ నా అమాయకపు
కళ్లలోనికి చూస్తూ
అశ్రువులు కార్చింది;
మీ యమ్మ పిచ్చిగాని
ఏ యమ్మ నీకు విషంపెడుతుంది?
అంటూ, నన్ను తన ఎదకు చేర్చింది.
'రాను బాబూ
నీ జోలికి రాను నేను

రాను బాబూ
నీలోనికి రాను తండ్రీ' అంటూ
అభయ మిచ్చింది నాకు
అమృత మిచ్చింది నాకు
ఆ నాటినుంచి నేను
అసూయకు దూరమైనాను
సమస్తలోకానికి
సన్నిహితుణ్ణయినాను.

అమ్మ ఒడిలో
ఊరి బడిలో
ఆనాడు నేర్చుకున్న
ప్రేమాక్షరాల
అక్షరాల ప్రేమ
మనిషిమీద నాకున్న
మమకారం పెంచుతున్నవి
నేనంటే నాకున్న
అహంకారం త్రుంచుతున్నవి -

ప్రేమ వెలిగిస్తుంది ప్రమ
ద్వేషం కలిగిస్తుంది భ్రమ
అందుకే
ద్వేషాన్నైనా ప్రేమిస్తానే గాని
ప్రేమను ద్వేషించలేని
పిచ్చివాణ్ణి నేను
బుజ్జివాణ్ణి నేను -

# జీవనలాస్యం

కడలిరేవునుండి
సౌదామినులు
మబ్బుల కడవల్ని మోసుకుంటూ
దారిలో కాలుజారి పడిపోతే
పగిలిన
ఘనాఘన ఘటాలనుంచి
విముక్త జీవనాలు
సిరికొండవాగులో పడి
స్వేచ్ఛాగానం చేసినవి
శివసుందర నాట్యం చేసినవి -

నీరధి ఒడిలో నేర్చుకున్న
నిరంతర జీవనలాస్యం
మా ఊరి వాగులో దొరిలినా
మరచిపోలేదు సలిలం

రంగు, రుచి, రూపం మారినా
అంతరంగ వాసనలు మారని
అమృతోపమ జలం
ఇక్కడ
మన త్రికరణాల వృత్తికి కూడా
ఎక్కడి అనుబంధమో ఉంది.

జె. బాపురెడ్డి

# జలస్వామ్యం

ఏటిని చూసినా
ప్రాయేటిని చూసినా
నాటికీ నేటికీ నేను
పాట నైపోతాను
ఋషిమాటనై పోతాను.

నదీనదాలలో
నా ఎద నినదిస్తుంది
సాగర కాసారాలలో
నా సాహిత్యం వికసిస్తుంది.
లోకాన్ని జీవజలధిగా చూచే
లోచనం నాకు ఉంది
జీవితాన్ని జలధారలో వెదికే
జిజ్ఞాస నాకు ఉంది
నిజానికి మనది భూగోళం కాదు
జలగోళం !
జీవనకాసారం !!
ఖండఖండాలు
అందులో వెలసిన
కళాఖండాలు
అమృతభాండాలు

గుప్త జీవన
సప్త సాగరాలు
నీరు పోసి నారు పోసి

పెంచుతున్న మహోద్యానం
మహీతలం -

ఎన్ని గిరులు ! ఎన్ని ఝురులు !
ఎన్ని తరులు ! ఎన్ని విరులు !
ఎన్ని పక్షులు ! ఎన్ని పాటలు !
ఈ జీవన బృందావనంలో
ఈ జలధిజనిత మృణ్మయానందంలో! ...

విశాఖలో తొలిసారి నేను
జీవజలధి ఘోష విన్నప్పుడు
నాలోని సుప్తభావ సముద్రాలు
లిప్తలో మేల్కొన్నవి
తరతరాలుగా నా కోసమే
తరలి వస్తున్న తరంగాలు
ఆత్మాలింగనం చేసుకొని
అమృతం పంచిపెట్టినవి
శశివలెనే శరధికూడ
నాటినుంచి నాతో
చెరగని స్నేహం చేసుకొన్నది
ఎక్కడికి పోయినా
ఇదుగో ఇక్కడే ఉన్నానని
ఎదురై వస్తున్నది
ఏమిటి వ్రాస్తున్నావని
ఏమిటి చేస్తున్నావని
ఎంతో ఆప్యాయంగా
ఎదను తట్టి అడుగుతున్నది

జె. బాపురెడ్డి

# సాగరారాధనం

నాలో పొంగే
అనర్గళ అనుభూతి రసవాహినులు
గంగలై, గోదావరులై
రైనులై, నైలులై, వోల్గాలై, మిసిసిపీలై
హుయాంగ్‌హోలై, అమెజాన్‌లై,
దేశ సరిహద్దుల్ని ముద్దాడుతూ
చరిత్రలను, సంస్కృతుల్ని
స్నేహాలింగనంలో కరిగిస్తూ
శైశవగీతాలై, నా అనంతకవితా సాగరంలో
ఆడుకుంటున్నాయి - పాడుకుంటున్నాయి

హిందూ మహా సింధు దర్శనంలో
దీపించిన నా కవితాతత్త్వం
ఖండఖండాలను చుంబించింది
తీరతీరాలను స్పర్శించింది
అఖిల మహాంభోనిధుల్లో అక్షరాలా ప్రతిబింబించింది
విశాఖ బీచిలో నాకు వీచిరాజు వినిపించిన
అయంత్రిత అనుభూతి తరంగగానం
శాన్‌ఫ్రాన్సిస్‌కో శైలసానువులమీద నుండి
శాంత మహాసాగరంలోనూ ప్రశాంతంగా విన్నాను
హేగ్‌లో, ఏథెన్సులో - ఆస్లోలో, ఆంస్టర్‌డాంలో
తారాపథ తీరాలలో తాదాత్మ్యం చెందే రత్నాకరుణ్ణి
అదభ్ర అంతశ్చక్షువులతో
అవలోకించి అభిషేకించాను
అగణిత అస్పృష్ట సత్యహారాలతో
ఆనంద దేవతను ఆరాధించాను.

# సాహిత్య సామ్యవాదం

మా ఊరి కొండవాగులో నేను
ఏరుకున్న సప్తస్వరాలను
గోదావరి నాదవీణ గొంతులో పాడించాను
తుంగభద్ర రంగత్తరంగాలను
గంగాయమునలతో ఆడించాను
గంగా యమునల రహోగళ యుగళ గీతాలను
రైను నోట విన్నాను
రైను గాయాల గేయాలు చిందిన రక్తం
అమెరికా ముఖంమీద
స్వేచ్ఛారుణరేఖగా కన్నాను

గాలికి గట్లు లేవని
మబ్బులకు నియమిత మార్గం లేదని
స్వార్థం మన కళ్ళకు తొడిగే
సంకుచితత్వపు అద్దాలు తీసివేస్తే
మన చక్కని చూపులకు
చిక్కని లోచూపులకు
చీలికలకంటే ఎక్కువ
పోలికలే కనిపిస్తాయి ;
ప్రకృతిలో మానవప్రకృతిలో
పరస్పర రూపాలు దర్శిస్తాయి.
అందుకే-నేను సామ్యవాదిని
అందరిలో అన్నిటిలోని
సామ్యాలను కలిపే
సాహిత్య స్వామ్యవాదిని.
సౌహిత్య స్వామ్యవేదిని.

జె. బాపురెడ్డి

# త్రయీజీవనం

సాగరాలు, మేఘాలు, స్రవంతులు
జీవన చక్రంలో మూడు ఆరలు
నింగినీ నేలనూ కలిపే
నిరంతర నిశ్రేణులు
మానవ జీవితాలకు మహత్ ప్రతీకలు!
పరుగెత్తే తరగెత్తే
ప్రగతి శీలురు నదీ నదాలు
పల్లము వైపే ఉల్లము పారే
పరము సేవాపరాయణులు నదీ నదాలు ;

గాలి సోకినా
గులక రాయి తాకినా
నిలువునా స్పందించే గుణం
నీటికే దక్కింది
ఏటికే దక్కింది.

నదీ నదాలు లేకుంటే
నాగరికతలే లేవు
గంగానది లేకుంటే - గోదావరి లేకుంటే
నైలునది లేకుంటే - రైను నది లేకుంటే
నగరాలకు - నాగరికతలకు
జీవనాడులు లేవు -

యమున లేకుంటే బృందావనం లేదు
బృందావనం లేకుంటే
రాధామాధవులు లేరు
రాధ లేకుంటే
రాసక్రీడలు లేవు
రస జగాలు లేవు -

ఎక్కడ పుట్టినా సరే
ఒక్కటిగా కలిసిపోయే
సమన్వయ సూత్రం
స్రవంతులకే తెలుసు -
హిమాలయ శిఖరాలలో
ఎంతో కాలం తపస్సు చేసి
భారత యాత్రకు
బయలుదేరిన ఋషుల్లాంటి
గంగా యమునలను చూడండి !

ఆవేశంతో బయలుదేరి
హరిద్వారాన్ని దాటేసి
పల్లెలతో పట్టణాలతో
పచ్చని పొలాలతో
మచ్చికగా ముచ్చటిస్తూ
సమతా క్షేత్రాలలో
శాంతి సస్యాలు పండించి అలసిపోయిన
గంగమ్మను

ఆత్మాలింగనం చేసుకొనే
యమునను
అలహాబాదు సంగమంలో చూడండి!

ఆడుకుంటూ, పాడుకుంటూ
ఆల్ప్సు పర్వతాలకు
వీడుకోలు చెప్పుకుంటూ
ఐరోపా హృదయంలో
ఐశ్వర్యం పండించుకుంటూ
ఉత్తరాంబుధి తీరంలో
అభ్యంజన స్నానం చేసే
అప్సరలాంటి
రైనును చూడండి!

అన్ని నదులలో స్పందించేవి
మన అనుభూతి విరజావీచికలే !
అన్ని వీచికలలో నినదించేవి
ఆవేదనానంద గీతికలే !!

# ఆత్మ శ్రుతి

నీరధులు
నీరదాలు
నదులు
త్రికాల వేదులు
వాటికి
సంకుచిత సరిహద్దులు లేవు
భాషా వివాదాలు లేవు
వర్ణ వర్గ భేదాలు లేవు
సమానత్వానికి
సౌభ్రాతృత్వానికి
సంకేతాలవి;
ఆవేశానికి-ఆవేదనకు
ప్రశాంతికి-అశాంతికి
సాహసానికి-సంక్షోభానికి
సాదృశ్యాలవి;
మనిషి అంటే
మట్టి అంటే
మమతతో మనసు కరిగే
మహాత్మ లవి -

ఉదధికి
నాకువలెనే ఊర్ధ్వదృష్టి
మబ్బుల రెక్కలు తొడుక్కొని

ఏవేవో లోకాలకు
ఎగసిపోవాలని ఆరాటం -
కాని
గొంతుతడి లేని మట్టిని చూచి
తపించే మనిషిని చూచి
నిలువునా నీరైపోయి
నింగినుంచి మళ్ళీ
నేలకు దిగి వస్తుంది -
చెట్టుచేమకు సేదదీర్చి
మట్టికడుపులో రాగం తీసి
లెక్కలేని ప్రాణికోటికి
ఎక్కడికక్కడ జీవంపోసి
ఏటిదారినో, తోటదారినో
చల్లగా మెల్లగా ఇల్లు చేరుకుంటుంది
ఎనలేని
త్యాగభోగరాగానందంతో
నిర్మిమీషా జిజీవిషాగంధంతో
సుసృక్షా దిదృక్షా మరందంతో
అందుకే, నా ఆదర్శం
అంతర్వేదనల అంభోనిధులు
ఆశానిర్ఝర అంబుదాలు
అనురాగాల కూలంకషలు.

ఎక్కడున్నా-ఏ రూపంలో ఉన్నా
ఎవరికో ఒకరికి-ఏదోవిధంగా

సాయం చేసే సలిల గుణం
సహజంగా నాకు అబ్బినందుకు
సంపూర్ణానందార్ణవ
సదృశు ణ్ణయిపోతున్నాను
సానుభూతి గల మీలో
సరససత్య చంద్రుణ్ణౌతున్నాను.

మా ఊరి ఏరు మొదలు
మహీమండల మండిత మహానదులన్నీ
ఒకేరీతిగా నాలో పారుతున్న
ఓంకారస్వానధునులు;
నదీనదీ నాదనిధి
నా హృదయాంభోనిధి

ఏవస్తువును చూచినా
ఎవరో ఒక నిర్లప్త మహాశిల్పి
అందులో
ఆనందరూపాలు చెక్కుతున్న
అపూర్వ దృశ్యాలు
కనిపిస్తాయి నాకు
నీరవరావాలు
వినిపిస్తాయి నాకు
అల్పబుద్ధు లెవరైనా
ఆ శిల్పాలను చెరుపుతుంటే
అగ్ని జ్వాలనై పోతాను.
రుద్రలీలనై పోతాను.

జె. బాపురెడ్డి

# ఆనందం అందరిదీ

గాయని ఎవరిదైనా
గానమాధురి అందరిదీ!
భావుకుడు ఎక్కడివాడైనా
బావరసం అందరిదీ!
పూలతీవె ఎవరిదైనా
పూలసొగసు అందరిదీ
ఏదిఏది ఎవరిదైనా
అందం ఆనందం అందరిదీ-

కూటికోసం-కీర్తికోసం
ఆస్తికోసం-అధికారంకోసం
అణువణువులో ఒదిగియున్న
విశ్వంభరానంద భాండంలో
విద్వేష విషబిందువుల్ని విడువకండి,
స్వార్థ సంకుచిత పంకంతో
సమతాశుంభత్ మానస సరోవరాన్ని
మలినం చేయకండి -

ఒకరి ఆనంద మార్గంలో మరొకరు
బ్రతుకు యాత్ర సాగించినపుడే
అందరి ఆనందతీరాలకు
అందరూ చేరుకోగలరు-
కులతత్వాలు మతకలహాలు
జాతిబేధాలు వితండవాదాలు

కుట్రచేసి సృష్టించిన
కష్టనష్టాలను, ఆకలిదప్పులను
అకంచనలను, వంచనలను
అంతంచేసే
నా అక్షర కవితాశరం
సకలలోక సత్యానందవరం

జె. బాపురెడ్డి

# దేశకాలాలు

కాలం - దేశం
రెండు సమాంతర రేఖలు
"అనాది కొసనుంచి
అనంతత్వంలోనికి"
అజ్ఞాత విజ్ఞాని
నిర్మించిన
అపూర్వ రైలుమార్గానికి
ద్వైతాద్వైత పట్టాలు
దేశకాలాలు -
అన్ని జీవితాలు
అన్ని సంఘటనలు
అన్ని చరిత్రలు
అన్ని యాత్రలు
ఈపట్టాలమీదనే
సాగిపోతున్నాయి
వాటిమీదనే
ఆగిపోతున్నాయి -

జనన మరణాలు
ఆది - అంతాలు
కాలానికి ఇరువైపుల
కనుపించే రెండు పుటలు
కాలమనే కాగితానికి
దేశం రెండు పుటలు

కాలాన్ని చూడలేము
దేశాన్ని పట్టితప్ప
నిజానికి
పత్రమంటూ వేరే లేదు
పరచిన రెండు పుటలు తప్ప
రెంఢు పుటలంటూ వేరే లేవు
ఒకే ఒక పత్రం తప్ప.
అందుకే
దేశ కాలాలు
రెండులా భాసించే
ఒకే ఒక స్థితి
ఒకే ఒక గతి.

కాల బిందువుల
లీలా రూపరేఖ దేశం
దేశరేఖారూపలీల
కాల బిందువులు-
రెండు పుటలను పత్రంనుంచి
వేరు చేయలేనట్లే
సృష్టిపత్రంనుండి
దేశకాలాలను విడగొట్టలేం
అయినా
ఆ రెంటిని రెండుగా
అన్వయిస్తేనే
ఆశ్రయిస్తేనే తప్ప
జగతికి ఉనికి లేదు
మార్పుకు అర్థంలేదు.

జె. బాపురెడ్డి

# జీవచేతన - భావచేతన

కాలాన్ని జయించిన
భావాన్ని నేను !
దేశాన్ని అధిగమించిన
భాషను నేను !!
దేశ కాలాల లీలా వైభవాన్ని
దినవెచ్చం చేసుకున్న
దిగ్దిగంత యాత్రికుణ్ణి నేను
మానవ జీవిత రహస్య
మార్గాన్వేషిని నేను.

బహిఃప్రకృతిలో
నా అంతఃప్రకృతిని
నా లోని ప్రకృతిలో
బహిః ప్రకృతిని
దర్శిస్తున్న
దైవత్వాన్ని నేను.

పెరిగి పోతున్న
జిజ్ఞాన తరువు మీద
ఈ నాటికి పూచిన
విజ్ఞాన పరిమళం నేను
నా కంటె ముందు పూచిన
నానా భావ కుసుమాలు
ఫలించి ద్రవించి

నా రక్తమై పోయాయి
అందుకే
పరిణామానికి పాట నేను
భవిష్యత్తుకు బాట నేను
జననానికి మరణానికి మధ్య
జీవితాన్ని నేను -
కాల ప్రవాహ ప్లవాన్ని నేను
క్రమ వికాస విప్లవాన్ని నేను
రండి నాతో రండి
నా నాడుల్లో ఆడుకొండి
నా పెదవులపై పాడుకొండి
రండి !

ఆనంత చైతన్యంలో
ఆఖరు మెట్టు లేదని
ప్రాచీనం నుంచి
అర్వాచీనం నుంచి
సమీచీన భవితవ్యాన్ని
సాదిద్దాం రండి!
హేతువును వండి
ఇంద్రియాలను పిండి
జీవ చేతనంతో
భావ చేతనం వెలిగించి
ఇక్కడా-అక్కడా-అంతటా
ఇప్పుడు-అప్పుడూ-ఎప్పుడూ
అనంత ముఖానందాన్ని
ఆవిష్కరిద్దాం రండి !

జె. బాపురెడ్డి

# త్రి-ఆ-కారాలు

ఆకలి
ఆశ్చర్యం
ఆలోచన
మానవులందరినీ
ముడివేసే మూడు సూత్రాలు !
నరులనూ
నాగరికతలనూ
నడిపిస్తున్న మూల నేత్రాలు !
త్రిలోకాలు
త్రికాలాలు
త్రి లింగాలు
సంయోగ వియోగాలు చెందుతున్న
త్రిశక్తి తీర్థ తీరాలు -
ఎక్కడ వెలసిన మనిషి అక్కడ
ప్రకృతి బడిలో నేర్చుకున్న
ప్రప్రథమ పాఠా లవి!
అజ్ఞాన మహా సాగరంలో
ఆవిర్భవించిన
హాలహలామృత నౌక లవి !

ఆకలి లేకుంటే
అన్నంతో పనిలేదు
అన్నంతో పని లేకుంటే
రుజాజరా మరణాలు లేవు -

ఆకలితో మండిన మనిషి
ఆశ్చర్యాల కడిలిని చిలికి
ఆలోచనామృతంతో
దేశకాలాలను దర్శించాడు
దేవుణ్ణి సృష్టించాడు
తాను సృష్టించిన దేవుడే
తనని సృష్టించా డని
త్వమేవాహంలో పడ్డాడు
తత్వమసిలో పడ్డాడు !

ఆలోచనా రజ్జువు కందని
అనంతత్వ కూపంలో నుంచి
స్వయంభూ దైవత్వాన్ని
చకచకా చేదుకొని
శరణు నీవే అన్నాడు
వెలుగుబడిలో తీరని సందేహాలను
చీకటి గుడిలో తీర్చుకున్నాడు
హేతువు ఏలలేని దిగంతాలను
ఈశ్వరునికి అప్పగించాడు
భయభక్తులు కప్పంగా
భగవంతునికి చెల్లిస్తూ
బ్రతుకుయాత్ర సాగిస్తున్నాడు.

జె. బాపురెడ్డి

# మానవ సేవకుడు మాధవుడు

కాశీలో విశ్వేశ్వరుడు
తిరుపతిలో వేంకటేశ్వరుడు
జరుస్లంలో
వాటికన్‌లో
మక్కాలో మదీనాలో
దివినుండి దిగి వచ్చిన
దేవదూతలు
మనిషి సేవ చేస్తున్నారు
మనిషి కోసం జీవిస్తున్నారు.

గుడిలో గోడలో
రాతి విగ్రహంలో
రంగుల బొమ్మల్లో
ఏ ఆకారంలో
ఏ ప్రాకారంలో ఉంచినా
ఎదురు చెప్పకుండా ఉండి
మనిషి పెట్టిన బరువుబాధ్యతలను
మౌనంగా నిర్వహిస్తున్న
మహాత్ముడు పరమాత్ముడు;
అమాయక మానవుల
అంతేవాసి
మాయామయ దైవం !

# ఆపత్కాల బాంధవుడు

దేవుడున్నాడని నమ్మి నిజంగా
మనం మానేసిం దేమీలేదు
చేతనైనదంతా చేసుకొనే
చేతనామయులం మనం
చేతగానిదంతా
దేవునితో, దేవదూతలతో
చేయించుకునే
స్థితి ప్రజ్ఞులం మనం.
మన ఆనందం కోసం
దేవునికి
మాటలు నేర్పిన, మతం నేర్పిన
మహానుభావులం మనం
చిదానందులం మనం !

సర్వ ధర్మాలను పరిత్యజించి
సర్వేశ్వరుణ్ణి శరణంటాం
ఇహపర సుఖాలకోసం
ఎవరినైనా వేధిస్తుంటాం
స్వార్థానికి సానుకూలంగా ఉంటేనే
ఏ దేవుడి మాటైనా వింటాం
చావుభయం ఒకటిపోతే
దేవుడి బ్రతుకు గోవిందా
అనంతం అంతమై పోతే
అందరి పని గోవిందా.

జె. బాపురెడ్డి

# నిస్సహాయుడు దేవుడు

నేను
దేవుని గుడికి వెళ్ళేది
వరాలు అడగడానికి కాదు
వాంఛలు తీర్చుకొవడానికి కాదు
దేవుని స్థితి చూసి కాస్త
ధైర్యం తెచ్చుకోవడానికి !
నిస్సహాయుడైన దేవునిలో
నా రూపం చూచుకోవడానికి !
రూపం లేని దైవాన్ని
నా రూపంలోనే చూచుకోవడానికి !

అనంత సృష్టిని పాలించే
అనంతాతీతం ఏది ?
అనంతాతీతం నివసించే
ఆఖరు మెట్టు ఎక్కడ ?
దేవుడంటే అందుకే నాకు జాలి;
అయినా అతని భావనలో
అనంత ఆనంద రసకేళి -

దేవుడున్నాడనడం
పచ్చి మూర్ఖత్వం
లేడనడం
పరమ మూర్ఖత్వం;

ఉన్నాడో లేడో అని
ఊపిరి పీల్చడం
ఉభయ మూర్ఖత్వం.
మూర్ఖులు మూడు రకాలు;
అన్ని రకాలవారిని ఆదరించే
అనంత మూర్ఖుణ్ణి నేను.

దేవుడున్నాడంటే
ఒరిగేది లేదు
లేడంటే ఊడేది లేదు
ఇటూ అటూ ఊగినా
ఎవరికీ ప్రమాదం లేదు.

గుడిలోని దేవుడు
ఏ బడిలో చదువుకున్నాడు
అన్నీ తెలిసిన వాడని
అందలం ఎక్కించడానికి !
కొండమీద దేవుణ్ణి
కొలిచే ఓ బుల్లోడా
నీ గుండెలోని రామచిలుక
గుట్టు తెలుసుకో !

జె. బాపురెడ్డి

# ప్రణవాకారం

అనంత సృష్టిలో పరమాత్మ
అనంత పరమాత్మలో సృష్టి
అనంతంలో కొంతేమిటి !
కొంతలో అనంతం ఏమిటి !
ఎవరికి తోచింది వారు
ఏకరువు పెట్టడమే తప్ప
ఎవరికీ తెలిసింది ఏమీలేదు
తెలుసుకోవలసింది అనంతం అని
తెలిస్తే చాలు.

తెలుసుకోవలసింది
అనంతం అయినప్పుడు
తెలిసిం దేమీ లేదు
అనంతం
ఉన్నదన్నా లేదన్నా
అర్థమయ్యే దేమీ లేదు
దేవుడు
ఉన్నాడన్నా లేడన్నా
తేటతెల్ల మయ్యే దేమీ లేదు
తేలేదేమీ లేదు.

అజ్ఞానం అనంతం
విజ్ఞానం అనంతం
గతం అనంతం

వర్తమానం అనంతం
భవిష్యత్తు అనంతం;
అనంత త్రికాలు
అనంత త్రికాలాలు
అనంత త్రివర్ణాల
ఆనంద చేతనా కేతనం !

అనంత చేతనకు
అగణిత ముఖాలు
భౌతికాలు
బౌద్ధికాలు
క్షణికాలు
శాశ్వతాలు
అన్నిటికీ ఒకే ఒక ఆకారం
ప్రణయ, ప్రళయ
ప్రణవాకారం
సృష్టిలయ ఓంకారం !

జె. బాపురెడ్డి

# ప్రణయ హేల

ఆనంద బ్రహ్మ
ప్రణవలీలా పరిష్వంగంలో
అనంతరహస్య గర్భవతియైన
అప్రమేయ శక్తి శైలూషి
ఈ ప్రకృతి !
నిరంతర సత్య ప్రసూత ఆమె
నిత్య చైతన్య ఘోషవతి ఆమె -
అనంతాకాశ క్షేత్రంలో
చల్లిన నక్షత్ర బీజాలు
కోటి కోటి వర్షాలలో తడిసి
కుట్మలించి, కుసుమించి
ఫలిస్తున్నాయి;
సృష్టి సుందరి ప్రణయాంకంలో
శుంభత్ శృంగార రసతరంగాలై
జీవనాట్యం చేస్తున్నాయి.
అందుకే
ఎటుచూసినా ప్రణయ హేల
రమ్య రహో రాసలీల -
మార్తాండ మయూఖాలతో
నిబిడ నిశాకరాలలో
అనుక్షణ జీవశక్తి సంభోగం
అవిచ్ఛిన్న సృష్టిలయ యోగం
జీవకోటి హృదయోన్మిషిత

జిజీవిషారాగం
తరులతా భావోద్భిజ్ఞ పుష్పపరాగం
సాగించే
ప్రభవ విభవ విప్లవ కేళిలో
ప్రబుద్ధ మౌతున్న
ప్రణవ హృష్టి ఈ సృష్టి -

# కలలుగనే కన్నీరు

బాధల బొంబాయిని ఓదార్చే
జూహూ బీచ్‌ని చూచి
వెక్కి వెక్కి ఏడ్చే వెర్రి కడలిలో
నా కన్నీటినంతా కార్చివేసి
ఆత్మానంద విహంగమునై
అంబుధులు దాటిపోయాను
వివేకానంద
ప్రవచనాగంధ బంధురమైన
షికాగోలోని శాంతారామంలో
బహాయి ధ్యాన మందిర
నిశ్శబ్దనీరధిలో
మరల కన్నీటి కెరటమై పోయాను
బాధల తటాన్ని దాటలేని
బాష్ప వీచినై పోయాను.

ఎంత ఎగసినా ఎంత అరచినా
తీరాన్ని దాటలేని వారాశి తరంగంలా
ఉవ్వెత్తున పొంగే నాఆలోచనలు
గుట్టెరుగని గట్టుకు కొట్టుకొని
అల్లల్లాడి పోతున్నవి
నురుగులు క్రక్కి కరిగి పోతున్నవి
ముందు వెనుకలకు ఊగిపోతున్నవి.

చెలియలికట్టకు భయపడి
చెలరేగుట మానని కెరటాలవలెనే
మృత్యు తీరానికి భయపడి
ముందుకు సాగడం మానలేవు
జీవన తరంగాలు
ఆలోచనా విహంగాలు.

జె. బాపురెడ్డి

# చేసిన తప్పే చేస్తున్నాం

చేసిన తప్పే చేస్తున్నాడు మనిషి
తన మృత్యువును తానే
అన్వేషిస్తున్నాడు మనిషి
విజయాలెన్ని పొందినా
అపజయం కలిగేదాక
విశ్రమించడు మనిషి.

ఐరోపాయాత్రలో
హఠాత్తుగా కలిశాను
వాటర్‌లూ రణరంగంలో
నెపోలియన్‌బొనాపార్టిని.
'ఎందుకయ్యా నెపోలియన్
ఇన్ని యుద్ధాలు చేశావు?
శాంతిని చెరబట్టటానికి
సమర మెందుకు చేశావు ?'
అంటే, ఆయన కంటతడిబెట్టి అంటాడు
'పది తలలున్న ప్రజ్ఞశాలి
మీ రావణుడు చేసిందేమిటి ?
అయిదూళ్ళు కూడా ఇవ్వనని
అన్యాయంగా పాండవులపై
దండెత్తిన దుర్యోధనుని
మొండితనం ఏమిటి?

ఔను
సమరోన్మాదాన్ని
సామ్రాజ్యవాదాన్ని
చర్వితచర్వణం చేసి
చరిత్రకు మసిపూసిన
హిట్లరు మతి ఏమైంది ?
హిరణ్యకశిపుని గతి అయింది;
చేసిన తప్పే చేసి
చెడిపోయినవాళ్ళం మేము, -

'కదంతొక్కే గుర్రం మీద
నిదురపోయిన నెపోలియన్
నేలదాహంతో నేలకూలేదాక
నిదురపోని సుయోధన్'
సూత్రాలేవో అల్లుకుంటూ
యాత్ర సాగించింది నా హృదయం
నవజీవన సమీరాలకు,
ప్రభుద్ధ ప్రభావతులు
ప్రసూన హారతులు పట్టే
కలల కడలి తీరాలకు,
విశ్వంభర పెదవిమీద
వెలిగే కాశ్మీరాలకు.

జె. బాపురెడ్డి

# లతాంత వేదాంతం

లతాంతం పుష్పం
జీవితలతాంతం బాష్పం
ఎక్కడ పూచినా
పుష్పాలు పుష్పాలే
ఎవరు రాల్చినా
బాష్పాలు బాష్పాలే -

మా ఊరు జడలో విరిసిన
మల్లెపూల పరిమళాలను
మసూరి కొండల గుండెల కురిసిన
ప్రసూన దళాలను
జతచేసిన జానపదగీతాన్ని
వేదనారమ వినిపించింది
కాలిఫోర్నియా కంఠంలో -

సుమ సావిత్రి
సుందర శివానందలహరిలో
నాడెందం వికసించింది
హాలీఉడ్ కొండ లోయలో
కళాకేశీ ముగ్ధ నాయికలవలె
చిద్విలాసం చిందే గులాబీల
చిత్ర చిత్ర వర్ణ జగత్తును
కెమేరాలో బంధించలేక
గుండెకెమేరాలో బిగించాను
ఎక్కడున్నా పూవులన్నీ

ఒక్కటే అన్న సత్యాన్ని
చిత్రంగా చిత్రించాను -

స్వేచ్ఛా స్వాతంత్ర్యాలు
కిర్మీర పక్షులై
తరులమీద లతలమీద
నిర్భయంగా
తిష్ఠ వేశాయో అన్నట్లు
అవర్ణనీయ వర్ణకుసుమాలు !
వానవా వాసంతాల
విజయ దీపావళి
ఆ అఖండ సుమావళి -

పూల విలువ తెలిసిన
పూర్ణస్త్రీ సత్యభామ
పరమాత్మను కాలదన్ని
పారిజాతాలను వరించింది
ఒక్క పూలమొక్కకోసం
ఇంద్రలోకాన్ని జయించింది
జడపూల విలువ తెలియక
ఒకప్పుడు నేనూ
జడభరతు ణ్ణయినాను
లతాంత వేదాంతంలో మునిగి నేడు
రసభరితు ణ్ణయినాను -

జె. బాపురెడ్డి

# ఊహలు నా ఊపిరి

కల గనకుండా నేను
కనగలిగింది లేదు
బాధించిన దాన్ని దేన్నీ
సాధించిక పోలేదు.

పిచ్చుక గూళ్ళు కట్టిన నాడే
నాగుండె గూళ్ళలోనుండి
ఊహల పిచ్చుకలు
ఎటో ఎటో ఎగిసిపోయేవి.

రెండవ ప్రపంచ యుద్ధంలో
రెక్క వాల్చని విమానాలు
మా ఊరుమీదుగా వెళుతుంటే
ఊరంతా నోరు తెరచి
'గాలి మోటరు' చేసినవానికి
కేలు మోడుస్తూ ఉంటే
నేను మాత్రం ఆ విమానంలో ఎక్కి
నింగిలో తేలిపోతున్నట్లు
ఊహిస్తూ ఊహిస్తూ
ఉలిక్కిపడి చూసేసరికి
ఒంటిగా మిగిలిన నేను
కంటిలోని ఊహలతో
కలిసి ఆడుకొనేవాణ్ణి.
విడ్డూరం ఏమిటంటే

ఉడ్డీనం నేర్చిన ఊహలు
విశాఖలో నన్ను నిజంగా
విమానం ఎక్కించినప్పుడు
చిన్ననాటి కలలెన్నో నేను
మిన్నుల్లో పండించాను -

ఊహలు వాస్తవాలైపోగానే
వాస్తవాల పందిళ్ళమీద మళ్ళీ
ఊహల తీగలు లేచినవి
కలల పూలు పూచినవి -

జె. బాపురెడ్డి

# భావనారమ

రేయింబవళ్ళే రెక్కలైన
బోయింగులలో
చక్కని నా భావనారమతో
చుక్కల రసగుల్లాలు తింటూ
ఆర్కిటిక్, అట్లాంటిక్
అగాధ పారావారాల మీదుగా
ఆసియా, ఐరోపా, అమెరికా
అనేకానేక దేశాలమీదుగా
అలవోకగా విహరించాను
పయోధర పారిజాతాలలో
జలద జలజాతాలలో -

నింగిలో పొంగిపొరలే
పాలకడలి కెరటాలపై
నాదబ్రహ్మ నారదునితో
మోదబ్రహ్మ గంధర్వులతో
లీలగా చెలిమి చేశాను -
స్వేచ్ఛాజ్ఞాన వల్మీకాలైన
అల్ప్సు హిమాలయాద్రులతో
ఆత్మహస్తం కలిపాను.

న్యూయర్కు నగర గగన వీథుల్లో
విహరించే విమానాలు
స్వేచ్ఛాలక్ష్మి
'స్టాచ్యూ ఆఫ్ లిబర్టీ'
స్నేహ హస్తాలు ఎగురవేసిన
శాంతి పావురాల్లా ఉన్నాయని
భ్రాంతిగీతాలు పాడుకొన్నాను.

జె. బాపురెడ్డి

# భావనారమ

రేయింబవళ్ళే రెక్కలైన
బోయింగులలో
చక్కని నా భావనారమతో
చుక్కల రసగుల్లాలు తింటూ
ఆర్కిటిక్, అట్లాంటిక్
అగాధ పారావారాల మీదుగా
ఆసియా, ఐరోపా, అమెరికా
అనేకానేక దేశాలమీదుగా
అలవోకగా విహరించాను
పయోధర పారిజాతాలలో
జలద జలజాతాలలో -

నింగిలో పొంగిపొరలే
పాలకడలి కెరటాలపై
నాదబ్రహ్మ నారదునితో
మోదబ్రహ్మ గంధర్వులతో
లీలగా చెలిమి చేశాను -
స్వేచ్ఛాజ్ఞాన వల్మీకాలైన
అల్ప్సు హిమాలయాద్రులతో
ఆత్మహస్తం కలిపాను.

న్యూయర్కు నగర గగన వీథుల్లో
విహరించే విమానాలు
స్వేచ్ఛాలక్ష్మి
'స్టాచ్యూ ఆఫ్ లిబర్టీ'
స్నేహ హస్తాలు ఎగురవేసిన
శాంతి పావురాల్లా ఉన్నాయవి
భ్రాంతిగీతాలు పాడుకొన్నాను.

# చరిత్ర చితాభస్మం

దేశ దేశాలమీదుగా
ఆకాశంలో ఎగిరి పోతున్నప్పుడు
నేలవైపు తొంగిచూస్తే
జాలివేసింది నాకు -
వేల వేల వసంతాలుగా
ఈ నేల వ్రాసుకుంటున్న చరిత్ర
గాలి కెరటాలమీద
నా కెక్కడా
కనిపించలేదు, వినిపించలేదు -
అనంతాకాశ గ్రంథంలో
అటూ ఇటూ తిరగబడుతున్న
అసంఖ్యాక మేఘాల పుటల్లో
ఏదేశ చరిత్రను గురించి
ఎక్కడా ఒక్క ముక్కకూడా లేదు.

శూన్యవ్యోమాలయ కుడ్యాలమీద
చంచచ్చంచలలు వ్రాసే
మిధ్యా భావరేఖల్ని చూచి
విరగబడి నవ్వుతున్నాయి
వెఱ్ఱి మొఱ్ఱి నక్షత్రాలు.

ప్రచండ సూర్యమండల కాష్ఠంలో
దహన సంస్కారం పొందిన
గత చరిత్రల చితాభస్మాలను
కాలబ్రహ్మ కలిపివేస్తున్నాడు
పవిత్రాకాశ పయోనిధిలో

జె. బాపురెడ్డి

# కిరణాటక సంగీతం

గుండె మంటల్ని భరించలేక
గోలపెడుతున్న సూర్యుని
కిరణ రణ సంగీతాన్ని
చల్లగా శ్రుతిచేసి
సరదాగా పాడుకుంటున్నాడు
పనీ పాటూ లేని చందమామ
వెన్నెల పాటలుగా
విరహ గీతాలుగా -
నీలి నిశా టౌన్‌హాలులో -
చెవులులేని నక్షత్ర శ్రోతలు
కళ్ళు మిటకరిస్తూ
పళ్ళికిలిస్తూ
మైమరచి వింటున్నారు -

సూర్యకిరణాటక సంగీతం
చంద్రగాత్రం నుంచి వింటేనే
శ్రవణ శుభగంగా
హృదయ స్పదంగా ఉంటుందని
తలతిరిగే భూగోళం
కలవరిస్తూ పలవరిస్తున్నది -
మంటల్ని మ్రింగిన పూర్ణశశి
గరళకంఠంలోనుంచి
శీతల గీతామృతం చిందుతుంటే

ఆనందంతో
సప్తస్వరాలను
ఆలపిస్తున్నాయి
సప్తాంభోరాసులు -

నేలమీద వేనవేల భాషలు
తరతమ భేదాలు మరచి
ఒకే ఒక్క
తాదాత్మ్య భావ సూత్రంలో
తలలూపుతున్నాయి.

జె. బాపురెడ్డి

# ఏకాంత ప్రశ్నలు

ఏకాంతం అంటే నాకు
ఎనలేని భయం
అది
నన్ను ఏవేవో ప్రశ్నలడిగి
హింసిస్తూంది
అర్థంలేని అభియోగాలతో
నన్ను అవమానిస్తూంది
సానుభూతితో
నిశ్శబ్దం
నా తరపున
సమాధానాలు చెపుతున్నది
సంజాయిషీలు ఇస్తున్నది -

చిత్ర చిత్రమైన ప్రశ్నలకు
చిలిపి చిలిపి సమాధానాలు
అర్థంలేని అభియోగాలకు
అర్థంకాని సంజాయిషీలు
ఏకాంత ప్రశ్నలకు
నిశ్శబ్ద సమాధానాలు -

ఏకాంతానికీ, నిశ్శబ్దానికీ మధ్య
ఏరులా ప్రవహిస్తున్న నేను
ఔను ఔను, కాదు కాదు అంటూ
అస్తినాస్తుల్లో ఊగిపోతున్నాను
అయోమయంలోనికి సాగిపోతున్నాను.

# అడుక్కునే ఏరు

ఏమిటి నీ పేరు?
ఏరు -
ఏ ఊరు నీది ?
తెలియదు -
ఎందుకు వచ్చా విక్కడికి ?
దారి తెలియక -
ఏమిటి చేస్తుంటావు?
అడుక్కు తిరుగుతుంటాను -
ఏమిటి అడుక్కుంటావు ?
ప్రశ్నలు -
ఎవరిని అడుగుతావు ?
కొండల్నీ, కోనల్నీ
నింగినీ నేలనూ
శబ్దాన్నీ, నిశ్శబ్దాన్నీ -
ఏమిటి నేర్చుకుంటున్నావు ?
సందేహాలు-సమస్యలు-

ఇక్కడ నీ కెలా ఉన్నది ?
అజ్ఞానంగా
అంటే ?
ఆనందంగా
ఏం కావాలి నీకు ?
ఇక్కడ ఉండనీయండి

ఏం చేస్తావు ?
నీ పాట వింటూ కూర్చుంటాను
ఇక్కడ ఉండటానికి వీల్లేదు -

వెళ్ళకుంటే ఏంచేస్తావు ?
మాయల మబ్బుల్లోకి విసిరేస్తాను
ఎందుకు?
మళ్ళీ ప్రశ్నలు అడుగుతున్నావు !
అడుక్కుంటూ
తిరుగుతూ ఉండు
తిరుగుతూ
అడుగుతూ ఉండు
అడుక్కోవడం నీ విధి -

ఇంతకీ
మీ రెవరో ?
నే నెవరో తెలిస్తే
నీవు నేనే అయిపోతావు
నేను నీవే అయిపోతాను.

# ఎవరు నేను !

గతాన్ని
ఆ గతంతో తూచే
వర్తమానాన్ని
నేను-

ఉభయ సత్య తీరాలమధ్య
నలిగిపోయే
సందేహాల
స్రవంతిని నేను-

కాలాన్ని - దేశాన్ని
కొలిచే
కాంతి రేఖను నేను-
అనంతత్వానికి
దైవత్వానికి
మధ్య
అయోమయత్వాన్ని నేను-

జననానికి
మరణానికి
మధ్య
జీవితాన్ని
నేను-

జె. బాపురెడ్డి

# ఏకాంతంలో వేదాంతం

జీవునిలో ఉన్నది ఆత్మ
దేవునిలో ఉన్నది పరమాత్మ
బ్రతికినంతకాలం ఈ లోకంలో
చచ్చింతర్వాత పరలోకంలో
ఉండే మానవునిలో
ఉండే ఆత్మే
పరమాత్మకు ప్రతిరూపం అన్నారు
నరుడే
నారాయణుని ప్రతిరూపం అన్నారు-

ఆత్మ ఉంది కాబట్టి
పరమాత్మ ఉండాలన్నారు
ఇహలోకం ఉంది కాబట్టి
పరలోకం ఉండే ఉండాలన్నారు-

పుట్టింది ఉన్నప్పుడు
పుట్టించే వాడు ఉండాలన్నారు
పుట్టించేవాణ్ణి పుట్టించేవాడు
పుట్టాడు తనకు తానే అన్నారు-

స్వయంగా పుట్టనివాడు చస్తాడు
స్వయంభువుకు చావులేదు
ఇలా నడుస్తుంది వేదాంతం
ఎవరికీ బోధపడదు జీవితాంతం-

పుట్టిన ప్రతివాడు
ఒకప్పుడు చచ్చినవాడే
చచ్చే ప్రతివాడు
మళ్లీ పుట్టబోయే వాడే
చావు పుట్టుకలున్న వాడు
జీవుడు
చావు పుట్టుకలులేని వాడు
దేవుడు
చస్తూ పుడుతూ ఉండే జీవునిలో
చావకుండా ఉండేది ఆత్మ
చావదు కాబట్టి
ఆత్మ స్వయంభువు
పరమాత్మ స్వయంభువు
కాబట్టి
ఆత్మే పరమాత్మ అన్నారు-

ఆత్మ కనిపించదు, అందుకే
పరమాత్మ కనిపించదు
దేహం ఉన్న జీవుడు కనిపిస్తాడు
దేహం లేని దేవుడు కనిపించలేడు-

దేహాన్ని వీడిన ఆత్మ
ఎక్కడ ఉంటుంది!
దేహరహిత పరమాత్మలో
లీల మౌతుంది
పరమాత్మ ఉనికి ఎక్కడ !

అనంత విశ్వమంతటా
ఇలా చెపుతుంది వేదాంతం
ఎవరూ చూడలేరు దాని ఆదీ అంతం-

చర్మచక్షువులు చూడలేవు దేవుణ్ణి
అందుకే పొందుమన్నారు
మర్మచక్షువుల్ని -
మర్మ చక్షువులంటే ఏమిటి?
మన"లోని కన్నులు"
మరి అవి చేసేదేమిటి ?
లోని కన్నులు చూడజాలని
లోకం లేదు
అవి ఆత్మను చూస్తాయి
పరమాత్మను చూస్తాయి-

ఈ లోకన్నులు ఎలా వస్తాయి ?
ఈ లోకంలోనుంచి
పరలోకాల నేలా చూస్తాయి?
యోగంవల్ల-యాగంవల్ల
కలుగుతాయి
తపస్సు చేస్తే-తమస్సును జయిస్తే
వెలుగుతాయి -
ఎంతకాలం చేయాలి తపస్సు?
ఎలా జయించాలి తమస్సు?
జీవితాంతం చేయాలి తపస్సు
కళ్ళుమూసుకొని
జయించాలి తమస్సు-

ఆశలన్నీ తీరినప్పుడు
ఏదీ చూడ కోరికలేనప్పుడు
అన్నీ కన్పిస్తాయి
అన్నీ విన్పిస్తాయి-

అయితే
ఆ కనిపించింది
ఇతరులకు చూపించలేం
ఆ వినిపించింది
ఇతరులకు వినిపించలేం
అంటే
అలా కనిపించింది-వినిపించింది
అక్షరాలా నిరూపించలేం-
ఆత్మకు, పరమాత్మకు
అందుకే సాక్ష్యం లేదు
సాక్ష్యంలేని సత్యాన్ని
సాధిస్తేనే గాని
మోక్షం లేదు
"ఏమిటీ! ఏమిటీ వేదాంతం"?
ఇంతలో ముగిసింది నా ఏకాంతం.

జె. బాపురెడ్డి

# జి జీ వి ష

ఎలా బ్రతకాలన్న చింత
ఏనాడో వీడింది నన్ను
ఎలా చావాలన్న బాధ
ఇంకా పీడిస్తూంది నన్ను-

గత జీవిత సమరంలో ఎందుకో
మృత్యు దంష్ట్రల నుండి
తప్పించుకున్నాను;
కాని
మృత్యు అన్వేషణా పథంలోని
కానరాని ఆశాకుడ్యాలను
ఛేదించలే కున్నాను.
సరే బ్రతుకుదా మెట్లైనా అనుకున్నా
ఈ ఎడారిలో వర్షం కురుస్తుందా?
సాహసించి ఎట్లైనా చస్తామా
చచ్చిమాత్రం సాధించే దేమున్నది?
నేను చావాలని
ఎవరికైనా ఉందా అనుకొంటే
బ్రతకాలని మాత్రం
ఎవరికుంది అనిపిస్తుంది!
లంచాలు తినే దేవుళ్ళు
ఈ నిరుపేదను
స్వర్గానికి పోనిస్తారని
నమ్మక మేముంది?
రేపు, నా జీవితాన
మందారాలు ముసించవచ్చు
కాని, ఈ పూట బ్రతకడం తప్పు

కాబట్టి, నేడు చస్తే
రేపు మళ్ళీ జీవిస్తే
బాగుండేది - కాని ఏం లాభం?

చచ్చిన వాళ్లది
బ్రతికిన వాళ్లకంటే "మెజారిటీ" ఉంది
మెజారిటీలో కలిస్తే
నా ప్రత్యేకత ఏముంది?
మెజారిటీ పక్షం
మైనారిటీలను
బ్రతక్కుండా చేసి
తమలోకి లాక్కోవడానికి
చూస్తున్నట్లుంది దగాచేసి-

"ఆత్మహత్య మహాపాపం"
అన్నారు ఆర్యులు
చావడానికి తలపెట్టటం
చట్టానికి విరుద్ధంకూడా-

చావడానికేమో
వీలు కాకుండా ఉంది
బ్రతకటానికేమో
బాట కనిపించటం లేదు.

చావడం ఎలా అన్న ప్రశ్న
"బ్రతకరాదా" అంటుంది.
బ్రతకడం ఎలా అన్న ప్రశ్న
"చావలేవా" అంటుంది
వెనకా ముందూ ఆలోచిస్తే
ఎటూ తోచకుండా ఉంది.

జె. బాపురెడ్డి

# ప్రకృతి రహస్యాలు

లోక బాంధవుని బంధించిన
సంధ్యా రాక్షసికి నిరసనగా
ఈ జగత్తు
నిలిపిన నల్ల జండాల నీడలే
భూగోళ మంతటా
నిశీధులై నిండిపోతాయి
విజయోషస్సులో సూర్యుడు
చెరవిడి విచ్చేసేదాక.

హేమంత కుమారి
చలికి హిమమైపోవటం
సహించలేక
శిశిరుడెంత క్రూరుడైనా
చెదరిపోయిన ఆమె చేలాలు లాగి
చేర్చుకుంటాడు వెచ్చని కౌగిట్లో.

పర్జన్య రాక్షసుని
కరాళ గర్జారావానికి
ప్రకంపించే
శంపాలతలకు
శరణమిస్తుంది రేరాణి
తవింటిలో.

కొండ కోనల్లో తిరుగుతూ
బాల్యం నిండా
కష్టాలు అనుభవించటం వలననే కాబోలు
బ్రతుకు పండిన సెలయేటి బాల
మహానదీమతల్లిగా మారిపోయి
పంటచేలను కంటూంది-

కారణమే లేక
విషం గ్రక్కే నాగుబాములు కూడా
మల్లెపూల గంధమాధుర్యాలను
ప్రేమిస్తుంటాయి-

అందుకే
ప్రకృతి రహస్యాలు
పరిశీలించే వారికి
జీవితంలో అపజయం కలుగదు;
తన ప్రకృతిని ప్రకృతిలో
ప్రకృతిని తన ప్రకృతిలో
చూడగల్గిన వారు
బ్రతుకు
శోభా నిలయమని గ్రహిస్తారు -
ఓలోకమా!
ఈ సృష్టిని విలోకింప ప్రయత్నించు!
లోకము లోలోనికి
నీ లోకన్నులతో తిలకించు.

జె. బాపురెడ్డి

# మనోభిరాముడు

ఆనాటి విభావరీవనంలో
గుబురు గుబురుగా విరిసాయి ఇరులు
ఆనాటి పీడకలల గహనంలో
గలగలా పారాయి అశ్రు ఝురులు-

అశ్రువులు తప్ప ఆధారంలేని
నా అనంతశోకావృత హృదయాన్ని
ఇరుల భూతాలు భయపెట్టాయి
ఎక్కడో కనిపించిన
ఆశాజ్యోతిని నమిలి మ్రింగాయి-

నా నాడుల్లో ఆనాడు
దుఃఖాలు రక్తమై ప్రవహించాయి
నా బుద్ధిని
ఆలోచనా సర్పాలు
బుసకొట్టి కరిచాయి
కన్నీటితో తడిసిన
నా బ్రతుకు కేదారంలో
కోరికలు
చీకట్లు పండించాయి-

నా తల్లి ఒకవైపునుంచి
నా తండ్రి మరోవైపునుంచి
తోబుట్టువులు తలో వైపునుంచి
అశ్రు గంగలై వచ్చారు,
తీరం కనుపించని నా దుఃఖసాగరంలో
తిన్నగా కలిసిపోయారు-

భూగగనాలు తిరుగలి రాళ్లై
నా గుండెను పిండిచేశాయి
బ్రహ్మాండపుటంచులు
రాబందులై ఘోషించాయి;
నా చుట్టూ-నా లోపలా
నా క్రిందా-నా పైనా
నరకాలు నాట్యం చేశాయి
నాకు మిగిలిన ఒకే ఒక
ఆత్మాభిమానం అనే అంగవస్త్రాన్ని
అమాంతంగా పట్టి లాగేశాయి-

నాలోని ధిషణాహంకారం
నే చేసుకున్న సుకృతం, పరోపకారం
ద్రౌపదిలా సీతలా విలపించాయి
సత్యాన్ని సంరక్షించే వారెవరైనా ఉంటే
స్వప్నంలా రమ్మని పిలిచాయి-

తెలతెలవారినట్లైంది
శ్రీకృష్ణుడో శ్రీరాముడో
లీలగా వచ్చినట్లైంది-
కనులు తెరచి చూచేసరికి
కనుపించాడా కరుణామయుడు
కోదండం కిరీటం లేని రాముడు
కోటి కన్నీటి కాల్వలు హరించే సోముడు-
నా కళ్ళల్లో ఆశాకిరాణాలు నింపి
లోకంనుంచి చీకటిని మరోసారి సాగనంపి
నాలో నవజీవన వీణావాదం పలికించాడు
నాకీ లోకంమీద
మళ్ళీ నమ్మకం కలిగించాడు.

జె. బాపురెడ్డి

# నీరవ రావాలు

నా చుట్టూ వీస్తున్న గాలులు
నన్నేదో పాడుమంటున్నవి!
గగనంలో ఎగురుతున్న పక్షులు
నన్నీ గాలిలో తేలుమంటున్నవి!
అడుగడుక్కీ వేషంమార్చే మేఘం
"నా తత్వం కనుక్కోలే" వంటున్నది.

చందమామ అందంగా లేడని
చీకటి విలపిస్తున్నది
"నా పాటకు అర్థంలే"దని
కోకిల తానే చెపుతున్నది
తన బ్రతుక్కి ఆనందం లేదని
వసంతం వరునితో అంటున్నది-
తేటికి పూబోటికి సంయోగం
తేలిగ్గా లభించేది కాదట
పాడలేని పక్షులు సైతం
వీడనక్కర లేదట ఆమనిని-

ప్రతి అణువు గుండెనుండి
ఏదో (ని) వేదన
ప్రతిధ్వనిస్తోంది నా లోలోన
ప్రతి ఎండమావి కళ్ళలోయల్లో నుండి
ప్రవహిస్తున్నట్లున్నది
ఏదో ఆశాగంగ!

నీరవరవాలు వినిపిస్తున్న
నా నిర్మల నిశ్చలహృదయం
నిజాన్ని గ్రహించలేని జగాన్ని చూచి
నిశ్శబ్దంగా నవ్వుకుంటున్నది-

# నిత్య నూతన ప్రశ్న

భూతకాలం పెరిగినట్టా
భావి కాలం తిరిగినట్టా
క్రొత్త సంవత్సరం రావటం
అంటే, ఏమిటి జరిగినట్టు!

ఏమిటి ఈ పిచ్చి ప్రశ్న
ఎవరు ఎవరిని అడుగుతున్న
ఇరకాటపు ప్రశ్న ఇది?
వచ్చిపోయే వత్సరాలు
ఎక్కడికి నుంచి వస్తున్నాయో
ఎక్కడికి పోతున్నాయో
ఎవరికైనా తెలుసేమోనని
ఇప్పుడిప్పుడే అక్షరాభ్యాసం చేస్తున్న
ఈ అర్భకుడు అడగుతున్న ప్రశ్న-

అర్థం కాకపోయినా
అడగటం తప్పుకాదని
అడుగుతున్నాను;
తింటుంటే తింటుంటే
వేము
తియ్య నౌతుంది కదా!
అడుగుతుంటే అడుగుతుంటే
ప్రశ్నార్థం తెలుస్తుందని
ఆరాటపడుతున్నాను
ప్రత్యుత్తరం దొరక్కపోయినా
కనీసం
ప్రశ్న అయినా సరిగ్గా వేయటానికి
ప్రయత్నిస్తున్నాను-

జె. బాపురెడ్డి

# ఒక పుట

జననం ఒక పుట
మరణం ఒక పుట
మానవ జీవిత పత్రాలకు.

దినం ఒక పుట
రాత్రి ఒక పుట
రాలిపోయే కాలవట పత్రాలకు.

దేశం ఒక పుట
కాలం ఒక పుట
అనంతసృష్టి తాళపత్రానికి.

ఊహము ఒక పుట
వాస్తవము ఒక పుట
చూడగల్గిన మానవనేత్రానికి.

ఒకే పుటగల పత్రం లేదు
ఒకే తీరంగల నది లేదు
ఒకే ఒకటి ఏదీ లేదు
సకలం ఆమ్రేడితం
దేవుడు కూడా ఒంటరి కాడు
దేవీ సమేతుడు–

# సన్మాన సాగరం

చైత్రోదయ శుభవేళ
విశాఖ శైలసానువుల పంచలో
నల్లని కడలి పరచిన
తెల్లని ఇసుక తివాసీల మీద
సాయంసంధ్య నన్ను
సన్మానించింది
అందాల ఆ రసరాగిణి
అనుభూతుల విందుచేసింది-

దూరదూర తీరాలనుంచి
దూసుకుని వచ్చిన
సరససాగర తరంగాలచేత
నా కవితాత్మ కంఠంలో
నవఫేన మల్లికా మాలలు వేయించింది
ఆ మందస్మిత విరజ-

భావావేశపరవశు లైన
బాల సమీరాలచేత
నాక్కు సితపరాగాల
శాలువాలు కప్పించింది
మసకచీకటి చీరకట్టిన
మన్మథోహల సంజ-

జె. బాపురెడ్డి

జాబిల్లి వెండి గిన్నెలో
జానువెన్నెల పన్నీరు పోసి
మమతల మబ్బులచేత
నా మనస్సునిండా చల్లించింది
ఆ మహాను భావురాలు-

సుందర సుహృత్ శైలశిఖరాల వైపు
సాచిన నా అభినందన హస్తాలకు
ఆ సుమనోజ్ఞ సంధ్య
కమ్మని కలల కలాలు అందించింది
ఈ కడలి సిరాబుడ్డిలో వీటిని ముంచి
ఆ చుక్కలు తిరగవేస్తున్న
అనంత ^గగన పుటలమీద
అమృత కావ్యాలు వ్రాసుకొమ్మంటూ
అదృశ్యమైపోయింది.

# కాలవేది ఉగాది

ఉగాది వచ్చిందంటే
ఉలిక్కిపడ్డాను
ఏ ఉగాది ఈ ఉగాది?
ఎదురుగా నిల్చిన
ఏకాంతాన్ని అడిగాను-
ఏ ఉగాది వస్తుందో
ఏ ఉగాది పోతుందో
ఎరుగని
యోగనిద్రా ముద్రితుడవు
నీ వెవరు? అని
కాలవృక్షపు కొమ్మల్లో నుంచి
కలకంఠం ప్రశ్నించింది
వెర్రి సంభాషణ ఇదేమిటన్నట్లు
వేదాంత లతాంతాలు
విరగబడి నవ్వాయి-

వస్తున్నాయి, పోతున్నాయి ఉగాదులు
వస్తున్నాయి, పోతున్నాయి ఏడాదులు
ఎన్నికల్లో గెలిచిన నాయకుల్లా
ప్రభవ, విభవ, శుక్ల
ప్రభృతులు అరవై ఓటర్లు;
అయితే
ఓటర్లే కాదు వారు
అభ్యర్థులుకూడా
ఏడాది కొకరు
ఏకగ్రీవంగా ఎన్నికయి
ఉగాదినాడు

జె. బాపురెడ్డి

మనల్ని పాలించడానికి వచ్చే
ఉద్దండ నాయకులు వారు
తరాలు గడిచినా యుగాలు గడిచినా
అధికారం చెలాయించేది
ఆ అరవై మందే
కాలకర్తలు వారు
దేశభక్తులు వారు-

వెళ్ళే నాయకునికి
వీడ్కోలు చెప్పే
వేదాంతులం మనం
మళ్ళీ వస్తాడు అతడని
మరచిపోని
వ్యవహార దక్షులం మనం
వచ్చే నాయకునికి స్వాగతంచెప్పే
వంది మాగధులం మనం
అతనిలోని సద్గుణాలను శోధించి
ఆదరించే సహృదయులం మనం-

ప్రభవ, విభవ, విప్లవ గీతాలుపాడే
పరభృతాలం మనమే
జీవనరాగ విరాగ పరిమళంచిందే
భావపుష్పాలం మనమే
ఈ వసంతం మనమే
ఈ వనమంతా మనమే
అదుగో వచ్చాడు
చైత్రుడు! చైత్రుడు
అందరూ అనండి
క్రొత్తనాయకునికి జై
కాల వేదిది జై
ఉగాదికి జై!

# జాక్ పాట్

జాక్‌పాట్
నాకే వచ్చింది
ఒకే ఒక్క టికెట్టు కొన్న
నా ఒక్కనికే వచ్చింది;
రాకుంటే ఊరుకోడని
జాకీలకు తెలుసు
విశ్వాసపాత్రులైన
నా మిత్రులు
అశ్వాలకు తెలుసు-
ఏ గుర్రంమీద నేను కాస్తే
ఆ గుర్రమే గెలిచింది

దేశమనే మైదానంలో
కాలమనే గుర్రాలు
పెట్టే పరుగును
కవిపెట్టే శక్తి
పట్టుబడింది నాకు
అందుకే
ఏ పాటు లేదు నాకు
జాక్‌పాట్ తప్ప
ఏ గుర్రం గెలవలేదు
నా గుర్రం తప్ప.

జె. బాపురెడ్డి

# నాలో రవీంద్రుడు

నేను
అయిదారేళ్ల
అర్భకుడుగా ఉన్నప్పుడు
అనంతాకాశాన్ని చూస్తూ
అబ్బుర పడుతున్నప్పుడు
అస్తమించిన రవీంద్రుడు
ఉదయించాడు మళ్ళీ
నా కాలవేది నయనాలలో-

అందుకే
కోటికోటి వసంతారామ కుట్మలిత
జీవచైతన్యం
నా నోట విరుస్తూంది నేడు
నాదవేదాలుగా
అనంత సత్యాలుగా-

నేను స్పర్శించే
ఈ కాలం నవ్వుతూంది
నేను దర్శించే
నా దేశం నవ్వుతూంది
ప్రేమారామంగా
శ్రీకార శిఖరంగా-

# అక్షయానందం

ఏడుకొండల గుండెవెలుగు
జండాలెత్తి
చైత్రచైత్రరథంమీద వచ్చింది ఉగాది
సకలవరవితరణ వినోదియైన గోవిందునికి
ఆత్మానురాగ బృందావన విహారునికి
అభ్యుదయ వాసంతి కాంజలి
ఘటించింది-
అజ్ఞాన శిశిర బాధా తప్తజీవులకు
ప్రజ్ఞానమాకంద ఫలాలు
అందించింది-

మట్టిఘటాలల్లో
మాయల్ని హరించే
సత్యానుమసారాన్ని
సంపూర్ణంగా నింపి
పంచిపెట్టింది
లోకకళ్యాణకారిణియైన కాలవేది
నవజీవన భిషగ్మణి ఉగాది-

కోహ మనీ-సోహ మనీ
క్రొత్త కోకిల ఏదో
కొసరి కొసరి పాడుకుంటూంది
కొమ్మకొవెలమీద-

చెట్టు చేమలన్నీ శ్రీకారాలు చుట్టి
రాలురప్పలన్నీ పూలగొడుగులు పట్టి

పరవశంతో జరుపుకుంటున్నాయి
వసంతోత్సవాన్ని
దేశకాలాతీత గీతికాయజ్ఞాన్ని-

ఈ సుందర సుప్రభాతంలో
ఆబాలగోపాలం
గోడుగొడవల గుడ్డలు వదులుకున్నారు
క్రొత్త విలువల వలువలు తొడుక్కున్నారు
ఉత్తిష్ఠ! ఉత్తిష్ఠ! గానంలో
ఉద్దీప్తాత్ములై
రామ రామారామ రమ్య శుకపికాలు
నిగమాగమానంత నీలానుభూతిలో
వినిపిస్తున్నాయి
ప్రణవ విప్లవవేణునాదాలు-

కలల మెట్లెక్కి
శంకల మబ్బుల్ని దాటివేసి
చిదమలాకాశగంగా స్నానంచేసి
భక్త కోటులు
ఆత్మ శక్తి సంపన్నులై
ముక్త నక్షత్రాలవోలె భాసిస్తున్నారు
తిరుమల శిఖరాలపై తీర్థమాడుతున్నారు-

మోదమోదక ప్రసాదాలు ఆరగిస్తూ
భయభవరహితమైన
శివంకర ఋతంభరమైన
అక్షయానంద పంచాంగం
పఠిస్తున్నారు.

# సత్య సౌరభం

సత్య వైవిధ్యాన్ని
నిత్య నైవేద్యంగా
సాహిత్య సరస్వతికి
సమర్పిస్తున్నాను

"సర్వధర్మాన్ పరత్యజ్య
మామేకం శరణం వ్రజ"
మామేకం అంటే
"సత్యం నేనే" అని
మాధవుని మధురోహ;
సర్వ ధర్మాలు
సత్యానికి లోబడ్డవే కనుక
సత్య దర్శనంలోనే ఉంది
ధర్మసాధనం-

ధర్మాన్ని పట్టుకొని
ఊగులాడటం కాదు
జీవిత మంటే,
సత్యాన్ని సాధించుమని
కేలు సాచి,
సవ్యసాచికి
కేశవు డందించిన సందేశం
గీతయై వెలసింది-

కార్య దీక్షలో
సత్యాన్ని దర్శిస్తే
కర్మయోగం

ఆలోచనా దర్పణంలో
సత్యాన్ని దర్శిస్తే
జ్ఞానయోగం

ఆత్మార్పణంలో
సత్యాన్ని దర్శిస్తే
భక్తి యోగం

త్రియోగ ప్రయోగశాలలో
దిన దిన సత్యాలను కనిపెట్టే
తీరికలేని కోరికలం మనం !

భౌతిక సత్యాలన్నీ
నా కవితా జ్వాలల్లో లీనమై
నవ భావ సత్యాలై
ఆనంద తత్వాలై
నాట్యమాడుతున్నవి
విజ్ఞాన విజయశ్రీ శిఖరాలపై
వేద వేదాంత సాగర
తరంగాలపై.

# ప్రణవ ప్రణయం

దేశం దైవత్వంగా
కాలం అనంతత్వంగా
ప్రణవానంద ప్రణయలీలా
పరిష్వంగంలో తేలిపోతున్నాయి;
అఖండ సృష్టి సంతతి ఆవిర్భవిస్తున్నది.

సూర్యచంద్రాది గ్రహావళి
సుందర చకత్తారావళి
అనల అనిల సలిలాది అద్భుత భూతావళి
అనంతత్వ గర్భకోశం నుండి
అవతరించి ఆడుకుంటున్నాయి
ఆత్మానంద పారవశ్యంలో-

వెలుగు చీకటి పరదాల వెనుక
వింత వింత వేషాలు వేసి
బ్రహ్మాండ భావరంగం మీద
అప్రమేయ నాటకం ఆడుతున్నారు
దేశం అనే నాయకుడు
కాలం అనే నాయిక-

మానవ దేహ మాయా మయసభలో
అమాయికంగా ఆసీనులైన
పంచేంద్రియ ప్రేక్షకులు
పరవశించి చూస్తున్నారు
ఆ రమ్య రహోరాసక్రీడలు
దృష్టాదృష్టపు వెలుగునీడలు-

నీవు దొంగ అంటే
నీవు దొంగ అంటూ
పరస్పరం పరిహాసమాడుతూ
పట్టుకోబోతున్నారు
కలిసినట్లే కలిసి విడిపోతున్నారు
రైలు పట్టాల్లాగ;
వీడినట్లే వీడి కలిసిపోతున్నారు
భూనభాలుగా
గతాగతాలుగా-

ఏమిటీ ఈ వింత నాటకం
ఎందుకో ఈ భ్రాంతి నాటకం!
ఒకరినొకరు పిలుచుకుంటున్నారు
ఓంకార గళాలెత్తి
శ్రీకార కరాలెత్తి-
ఒకరినొకరు కొలుచుకుంటున్నారు
అగణిత తారాహారాలతో
అచలిత నీలాకాశ పారావారాలతో

కాలం
కళ్ళులేనట్లు నటిస్తున్నది
దేశం
చెవులు లేనట్లు చరిస్తున్నది
ఒకరినొకరు స్పర్శిస్తూ
ఒకరినొకరు దర్శిస్తున్నారు
ఈ అపురూప నాటకాన్ని చూస్తూ
పంచేంద్రియ ప్రేక్షకులు
విశ్వాస అవిశ్వాస శ్వాసలు పీలుస్తూ

ఫ్లిస్తుపోతున్నారు-
"ఎక్కడున్నావు దేశం?"
ఎలుగెత్తి అడుగుతోంది కాలం
"నీలోనే ఉన్నాను"
నిశ్శబ్దంగా పలుకుతూంది దేశం

-వినిపించడంలేదు నీవు ఏమంటున్నది
-అవును నీకు చెవులుంటేగదా!
-చెవులులేంది నీకు, నాకు గాదు
కాకుంటే కళ్ళులేవు నాకు
-కళ్లెందుకు లేవు నీకు
కనుపించడం లేదు నేనే
-చెవులెందుకు లేవు నీకు
వినిపించడం లేదు నేనే

ఇపుడు నేను కనిపిస్తున్నానా?
కాలపు కామరూపం ప్రశ్నిస్తున్నది
మరి నీకు నేను వినిపిస్తున్నానా?
దేశపు నీరవరావం పరామర్శిస్తున్నది
-మాట్లాడవేం?
-వినిపించుకోవేమి?

"ఏమిటి ఈ వెర్రి సంభాషణ"
శ్రవణేంద్రియం ప్రశ్న

"ఎవరూ కనిపించరేం"
నయనేంద్రియం నసుగుతూంది

"వట్టి రుచిలేని ప్రవచనాలు"
నాలుక చప్పరిస్తూంది

"ముట్టుకోవడానికి ఏముందిక్కడ"
స్పర్శేంద్రియం సందేహిస్తున్నది
"గంధమూ లేదు జ్ఞాన గంధమూ లేదు
అంతా గందరగోళం"
ఘ్రాణేంద్రియం నిట్టూరుస్తున్నది-

ముద్దుగా నటిస్తూనే ఉన్నారు
ఇద్దరు
ఆసక్తితో చూస్తూనే ఉన్నారు
అయిదుగురు-
"వట్టిమాయా నాటకం ఇది"
విమర్శిస్తున్నారు ప్రేక్షక జ్ఞానులు
"వీళ్లేమి ప్రేక్షకులు!
వెర్రి మొర్రి అజ్ఞానులు
అయిదు బెజ్జాల అద్దంగుండా
ఆదితుదల అంచులు
అవలోకించాలని
ఆరాటపడే అయోమయులు"
పరహసిస్తున్నారు
అనంత పాత్రధారులు-

సత్యమైన పాత్రల నిత్యమైన నాటకం
సాగుతూనే ఉంది
అర్థమైనా కాకున్నా
ఆనందానుభూతికోసం
విజ్ఞాన వినోదంకోసం
సహానుభూతితో చూస్తూనే ఉన్నారు
సాపేక్ష ప్రేక్షకులు
నిరపేక్షా సాక్షికులు.

# సత్యశాయి - జీవిత సారధి

శ్రీకరంగా
సకల మత సేవితంగా
పరమాత్మ తత్వబోధాకరంగా
లోకవిలోకన ప్రణవలోచనంగా
ప్రభవించాడు సత్యసాయి బాబా -

ఆయన, ఒడిలో, గుండె గుడిలో
ఆలోచనల బడిలో
విరిసిన ప్రేమభావ శతపత్రాలకు
శంఖ - చక్రాలు,
చంద్ర రేఖలు
పవిత్రమైన శిలువలు
వాడిపోని దళాలై
వీడిపోని పరిమళాలై శోభిస్తున్నాయి -

ఆయన 'బంగారు' కటాక్షవీక్షణాలలో
తరించడానికి,
వేషబాషలు ఆటంకం కావు
మనసులోని శంకలూ, వంకలూ
విషాదాలు, వికారాలు తీర్చుకోవటానికి
వయోభేద, లింగభేదాల
వివక్షతలు లేవు -

ఆకలి తీర్చే అన్నదానంకంటే
మిన్న దానం లేదన్నాడు
దప్పకతీర్చే జలధారలు అదించడం కన్న
గొప్ప ధర్మం లేదన్నాడు
దళితులను, పతితులను దరిజేర్చడం కంటే
పవిత్రమైన వ్రతాలు, క్రతువులు లేవన్నాడు
వికలాంగులకు
సకల విధ సహాయాలందించడంకంటే
పుణ్యం లేదన్నాడు
పలుకు పలుకున
సత్యామృతం చిలుకుతున్నాడు
చిదమలానంద క్షేత్రాలలో
సేద్యం చేస్తున్నాడు.
పుట్టపర్తిని కైలాస గిరి చేసి
పుడ మినెల్ల పాలిస్తున్నాడు.

బాబా పుట్టిన రోజు
భగవంతుడు పుట్టిన రోజని
భక్తులందరు భావిస్తున్నారు
పుట్టపర్తిలో పుట్టిన సత్యం
పుడిమికి శివంకరం
సాయిబాబా వరరూపం
నిత్యానంద సుందర దీపం
అందుకే
మనసుకు పడుతున్న
మాయ చీకట్లను

చెదర గొట్టే శక్తి అతడు
పరిశుద్ధుల కామనలు తీర్చే
కల్పవృక్షం అతడు
"సంకల్ప సృష్టి" చేయగలిగే
సంపూర్ణ చైతన్యం ఆయన
సంక్షుభిత ప్రపంచానికి
ప్రశాంతి నిలయం ఆయన
ప్రేమయే త్రికరణాలకు
ప్రేరణమైన సేవాదేవాలయం ఆయన
కరుణయే ప్రతిష్ఠితమైన
దేహాలయం ఆయన.

జె. బాపురెడ్డి

# అద్వైతానుభూతి

సత్యం కోసం వెదికితే
మృత్యువు దొరికింది
ఆనందం కోసం తిరిగితే
ఆవేదన దక్కింది -

మృత్యువు కూడా
సత్యమేనని గ్రహిస్తున్నాను
ఆనందం - ఆవేదన
ఆమ్రేడితం అని
అంగీకరిస్తున్నాను -
అయితే,
మార్గమేదో, గమ్యమేదో
ఏది సత్యమో
ఏది మృత్యువో
ఏది ఏదో ఎరిగించే
బోధనాచార్యుడు
ఎవరా అని తర్కిస్తున్నాను.

ప్రశ్నలం మనమే
మరచిపోయి ప్రశ్నించేవాళ్లం మనమే
సమాధానాలు మనమే
సమాధానాలు ఇచ్చే
సత్యార్థులం మనమే!
వెదికే వాళ్లం మనమే
తుదకు మనకు దొరికేది మనమే!
దొరికినది పోగొట్టుకొని
మళ్లీ వెదికే వెర్రి వాళ్లం
మనమే!

# అర్థంకాని ప్రశ్నలు

నాలోని అమాయక బాల్యజిజ్ఞాసతో
నిరంతరం ప్రశ్నించే ప్రశ్నను
ప్రశ్నల్లాంటి ప్రశ్నలడుగుతూన్నాను

భూతకాలం పెరిగినట్టా!
భావికాలం తరిగినట్టా !
కొత్త సంవత్సరం రావటం అంటే
ఏమిటి జరినట్టు?

సృష్టి జీవిత ప్రాంగణం నుండి
ఊడ్చివేయబడుతున్న
ఈ అబ్దాలు, దశాబ్దాలు,
శతాబ్దాలు, యుగాలు
ఎక్కడ పూడ్చివేయబడుతున్నాయి?

అంతంలేని "కాలం"
అఖండధారంగా, అయాచితంగా
తనను త్రాగేస్తున్న "దేశం" దోసిటిలోకి
ఎక్కడ నుంచి దొరలి పడుతున్నది?

వచ్చిపోయే సంవత్సరాలు
ఎక్కడినుండి వస్తున్నాయో
ఎక్కడికి పోతున్నాయో
ఎవరికైనా తెలుసేమోనని

జె. బాపురెడ్డి

ఇప్పుడిప్పుడే "అక్షరాభ్యాసం" చేస్తున్న
ఈ అర్భకు డడుగుతున్న ప్రశ్నలివి -

అర్థం కాకపోయినా
అడగటం తప్పుకాదని అడుగుతున్నాను
తినగా తినగా వేము
తియ్యనవుతుందన్నారు గదా!
అడుగుతుంటే అడుగుతుంటే
ప్రశ్నల అర్థం తెలుస్తుందని
ఆరాట పడుతున్నాను -
ప్రత్యుత్తరం దొరక్కపోయినా
కనీసం ప్రశ్నఅయినా
సరిగ్గా వేయటానికి
ప్రయత్నిస్తున్నాను.

# సత్యాన్వేషణ

దేవుణ్ణి వెదుకుతున్న
దీపాలేనేమో
నవగ్రహాలూ నక్షత్రాలూ !
అంతులేని అంతరిక్ష కుహరంలో
అనాదిగా అలుముకున్న చీకట్లో
కనుపించే చరాచరాలను సృష్టించి
కనుపించకుండా విహరించే
దేవుని వెదుకుతున్న దీపాలేనా
నవగ్రహాలూ, నక్షత్రాలూ !

దిక్కుతెలియని నాలుగు దిక్కుల్లో
భయ శంకా వృత్తంలో
భ్రమాప్రమావలయంలో
అయోమయావరణంలో
దేవుని వెదుతున్న
దీపాలేనా నవగ్రహాలూ, నక్షత్రాలూ !

అప్రమేయ శూన్యంలో
అమృత నాదం ఆలపిస్తూ
నీలానంతత్వంలో నిశ్శబ్దం పాటిస్తూ
భావాతీతుడైన
దేవుని వెదుకున్న దీపాలేనా
నవగ్రహాలు - నక్షత్రాలు !

దేశ - కాల ప్రమిదల్లో
దేహాత్మలు వెలిగించి
సత్య దర్శనం కోసం
నిత్యాన్వేషణమేనా!

జె. బాపురెడ్డి

# జీవిత తర్కం

నేను మృత్యువును
నా వెంట తీసుక వెళతాను
అప్రమేయ ప్రశాంత సాగర గర్భంలోకి.
నా జీవితాన్ని
అజ్ఞాన విజ్ఞాన మార్గాల వెంట
అంతులేని ఆనంద పారావారాల లోకి
తీసుకవెళతాను -

జీవన్మరణాలు ఉభయతీరాలుగా
ప్రవహిస్తున్నాను
ఘూర్ణిస్తూ, గర్జిస్తూ, తరగలిస్తూ
ఎక్కడెక్కడ నుంచో హఠాత్తుగా వెలువడే
భావావేశంలో చెంగ లిస్తూ . . .
దిగంతాల వరకూ పరివ్యాప్తమయ్యే
ప్రకృతి సీమలు ప్రదర్శించే ఋతుక్రీడలను దర్శిస్తూ
అజ్ఞేయగమ్యం వైపు సాగిపోతున్నాను

ఆవేదనలకు పరితపిస్తూ
ఆనందాలలో పరవశిస్తూ
నా ఉనికిని సార్థకం చేస్తున్నాను
నన్ను నేను నిందిస్తున్నాను, అభినందిస్తున్నాను
ఆత్మీయంగా పరామర్శిస్తున్నాను
నా వేష భాషలు మార్చుకుంటూ
అనేక రూపాలతో, నామకరణాలతో

ప్రత్యక్షమౌతున్నాను
కర్తలు లేని క్రియలను -
క్రియలు లేని కర్తలను
రెండూ లేని కర్మలను
ప్రయోగించే భాషలో సంభాషిస్తున్నాను
అంతఃకరణమే వ్యాకరణంగా -

అందులో అంతర్భాగమై పోతేనే
అవగతమయ్యే
సంస్కృతిలో జీవిస్తున్నాను
నిష్క్రమించే ముందు
నేనెవరో తెలిసికొనే వరకు
కాలాన్ని, నిరీక్షించుమంటున్నాను.

# చంద్రజాలం

ఆకాశ మంటపంలో
గుమిగూడిన తారాగణాలను
మంత్ర ముగ్ధుల్ని చేసే
"కాంతిజిత్తులు" ప్రదర్శిస్తున్నాడు
అందాల చందమామ,
తన మాయల మంత్ర దండంతో -

విశ్వ ప్రకాశ యజ్ఞంలో
తలమునకలై ఉన్న
వీరమార్తాండుని
వేడివేడి కిరణాలను
వంపు తిరిగిన శూన్యావరణం వెనకనుంచి
దొంగచాటుగా తెచ్చి
అది తన స్వంత కాంతి "కళానిధి"గా
నమ్మిస్తున్నాడు చంద్రజాలికుడు
అమాయకులైన తారామణులు
టక్కరి చంద్రుణ్ణి రేరాజుగా
వెన్నెల దొరగా
ప్రస్తుతిస్తున్నారు పారవశ్యంతో -

నాకో సందేహం కలుగుతూంది.
సృష్టిరహస్యాలు తెలిసిన
సూర్యుడు కూడా,
అద్భుత యుక్తితో

తన అపారఅంగార నిధుల్ని
ఇలాగే,
దొంగిలించుక వస్తున్నాడేమోనని
సంశయం కలుగుతూంది -

అనంత రోదసీ
నిబిడాంధకార రంగస్థల మీద
చేతులు మారే
కాంతి ప్రసారాల
జీవనపరంపరల
చకచ్చకిత ప్రదర్శన మేమో ఇది -

ఏకాంతి సత్యమూలమో!
ఏది మాయాజాలమో!
వాస్తవమిధ్యకు
మిధ్యా వాస్తవానికి మధ్య
చిక్కిన మనస్సుకు
చిక్కని సమస్య ఇది !

## ఒకే మాతృభాష

రాయిరాయిలో వెదుకుతున్నాను
సృష్టరహస్యాలు
చెట్టుచెట్టులో కనిపెడుతున్నాను
మట్టి కడుపులోని గుట్లు -

కొండకోనల్లో తిరుగుతున్నాను
వెర్రిమొర్రి కోతిలా
పగలు-రేలు రెక్కలుగా
ఎగురుతున్నాను పక్షిలా!

చేపకంటి పాపనైపోయి
సింధువుల్ని తరుస్తున్నాను
పూలగుండె తావినై
గాలినే గాలిస్తున్నాను -

దొరకదని తెలిసికూడా
దొరికి నాట్లే పరుగిడుతున్నాను
తీరదని తెలిసికూడా
తీరినట్లే కూర్చుంటున్నాను

చుక్కెలతో శూన్యంతో
చుట్టరికం నెరుపుతున్నాను
మనిషికీ దేవునికీ
ఒకే మాతృభాష
నేర్పుతున్నాను.

జె. బాపురెడ్డి

# మృత్యు విశ్లేషణం

"జాతస్య మరణం ధ్రువం"
పుట్టింది గిట్టక తప్పదు
ఇది జనన మరణాలు
తమ సుస్థిర అస్తిత్వం కోసం
పరస్పరం కుదుర్చుకున్న
రహస్య ఒడంబడిక -
వాటి నిజరూపం బయట పెట్టుకోవద్దని
ఒక నిగూఢ ప్రకరణం కూడ
నిక్షిప్తం చేశాయి అందులో
వాటి ఉద్దేశాలను
బహురూపాలలో,
బహునామకరణాలలో
సూచించుకుంటూ
ఏ నిర్వచనానికి లోబడవు;
వెలుగు చీకట్లవోలె ఒకటితో ఒకటి
దాగుడు మూతలాడుకుంటాయి
ఆవర్తన తర్కంలో
ఉభయలింగ సమ్మిళిత స్వరూపంలో
అర్ధనారీశ్వరతత్వంతో
మాయాజాలం, నెరుపుతుంటాయి.

ఈజిప్టులోని 'పిరమిడులు'
రోం లోని 'కొలంబ్రియం'
మాస్కోరెడ్ స్క్వేర్‌లో 'మసోలియం'

భారతదేశపు 'తాజ్‌మహల్'
జీవితపు సమాధులు
మృత్యువుకు చెల్లించిన
ఒక అపహాస్యానికి
పరిహాసాస్పద స్పందన
మృత్యువు, జీవితపు జన్మహక్కనే
నిజ నిరూపణం -

జంతుశాస్త్రం - కీటకశాస్త్రం
సాంఘికశాస్త్రం - ఖగోల శాస్త్రం
రోగలక్షణ శాస్త్రం - మనోధర్మశాస్త్రం
తర్కశాస్త్రం - తత్వ శాస్త్రం
అన్నీ జీవశాస్త్రంతో ఆరంభమై
మృత్యు శాస్త్రంతో ముగుస్తాయి.

జె. బాపురెడ్డి

# ఏకాంతం

ఏకాంతం నన్నెంతో
భయపెడుతుంది
'అభియోగం' ఏమిటో
తెలుపకుండానే
చెరబడుతుంది!

ఆలోచనా కోలహాలాల
అంబుధిలో దాక్కున్న
లీలా కణాన్ని నన్ను
ఏలాగో పసికట్టి, చెరబట్టి
భయపెడుతూంది ఏకాంతం!

అడుగు ముందుకు వేయలేని
అవిటి వాణ్ణి నన్ను
బిక్కుబిక్కుగా త్రిప్పుతూంది
అంతరిక్ష పథాలలో
చుక్కలు చూచి వెక్కిరిస్తున్నా
లెక్క చేయని ఏకాంతం!

ఏకాంతం
ఎంతో విచిత్రమైంది!
చెవులు మూసి నాకేదో
శంఖరావం వినిపుస్తూంది
కనులు మూసి నాకే వేవో

కలల లోకాలు చూపిస్తూంది
పంచేంద్రియాలను మంత్రించి
పారవశ్యంలో ముంచేస్తూంది!

ఈ అనంతమైన సృష్టిలో
ఏది సత్యమో ఏది కాదో
చెప్పు! చెప్పు! మంటూ
నన్ను
చెప్పేదాక వేధిస్తూంది!

జె. బాపురెడ్డి

# భావసత్యాలు

తాడును పామనుకొని
చిచ్చి పోవద్దు!
పామునే తాడుచేసి
బ్రతికి పోదాం!

రాయిని దేవున్ని చేసి
మనిషిని బలి చేయొద్దు
మనిషినే దేవున్ని చేసి
జడతను తొలిచేద్దాం!

సూర్యుని వేడిని కొలిచే
చూపును పెంచుకుందాం!
హిమాలయాల గుండెల్నిమలచే
క్రేపును పంచుకుందాం

మన అనల్ప భావనలోనే
ఈ అనంత సృష్టి పుడుతూంది
మన జయాపజయాలలోనే
ఈ జగత్తు
మెట్టుతూంది - గిట్టు తూంది

మన భావమే
నిలిచిపోతూంది భౌతికమై
ఈ భౌతికమే
ఎగసిపోతూంది భావమై!
భావ-భౌతిక సత్య క్రీడలో
భాసిస్తున్నాయి
చరాచరాలు - చిరాచిరాలు

# శూన్యంలో చుక్కల కోట

శూన్యం ఎంత బలీయమైందో
చుక్కలను అడుగుతే తెలుస్తుంది-
ఒక్క బ్రతుకుభారం మోయలేక
ఉక్కిరి బిక్కిరి అవుతున్న మనిషి
లెక్కలేని చుక్కలను తన రెక్కల మీద
అడించే శూన్యావరణాన్ని
ఏమనాలో తెలియక
దిక్కులు చూస్తున్నాడు -
"ఆకాశం" అని పిలిచినా
"అంతరిక్షం" అని తలచినా
"అనంతం" అని కొలిచినా
అర్థంలేని మాటే అవుతుందన్న
యదార్థం తెలుసుకుంటున్నాడు

అన్నీ తానే అయినా "అక్షరం" చుట్టూ
వెన్నంటితిరిగే వెలుగు-చీకట్లను కన్న తల్లి
శూన్యమని
చుక్కల మౌన ప్రవచనం -
ఏ భాషలో, ఏ శాస్త్రంలో
సృష్టికీ, సృష్టిని సృష్టించిన శూన్యానికీ
లేదేమో నిర్వచనం
అన్నిటి కన్నా తేలికైన శూన్యం
ఎన్నిటినైనా భరించే శక్తిశాలి
అహంకారం విడిచిపెట్టి ఆలోచిస్తే
అవగతమయ్యే సత్యం శూన్యం
మమకారం పెంచుకొని ఆహ్వానిస్తే
ఆత్మానందంగా వచ్చే అనుభూతి శూన్యం

జె. బాపురెడ్డి

# దొంగాట

నేను పుట్టినప్పటి నుంచి
నా కళ్లకు గంతలు కట్టి
తనను పట్టుకొమ్మని
దాగుమూతలాడుతున్నాడు
చిలిపి చేష్టల దైవం -

పట్టుకో అని పట్టుబట్టీ నిలిచే
దిట్ట ఆతడే
పట్టరానట్లు పరుగపెట్టే
పిట్ట అతడే
పట్టుకొమ్మని నా పంచచేరే
విరాట్టూ అతడే!

అతనిది,
అంతమయ్యే ఆటకాదు
అర్థమయ్యే మాటకాదు
దిక్కుతెలిసే బాటకాదు

చిక్కని, చిక్కులు పెట్టే
వ్యూహం అది
చిక్కినట్టే చిక్కి
శిఖరాలెక్కి కూర్చుండే
చిత్రాతిచిత్రమైన
రణనీతి అది
అజేయ హేతి అది

ఆ మాయదారి మాయలు
చూడాలంటే
బయటి కళ్లు మూయాలేమో!
లోని కళ్ల తలుపులు తీయాలేమో!
మూసినా తెరిచినా
కనిపించే
కళ్లు
ఆశలన్నీ వదులు కుంటేనే
అబ్బుతాయేమో!

జె. బాపురెడ్డి

# సమాధానంలేని ప్రశ్నలు

కలలో దేవుడూ నేను
కలిసికున్నాం
ఒకరి సాధకబాధకాలు
ఒకరం తెలిసికున్నాం!

'స్వామీ! నీవు అపారశక్తి మంతుడవు' అంటే
'కాదు! నీవే అద్భుత శక్తిశాలివి' అంటూ
ఒకరినొకరం పొగుడుకున్నాం
ఎవరిని వారే తెగడుకున్నాం

ప్రభూ! నీవు ఆరిపోని మహానదివి అంటే
కాని, నాకు శాంతి లేదు, విశ్రాంతి లేదు
నీవు ఆటపాటల తరంగానివి అన్నాడు

దేవా! నీవు అంతుతెలియని జీవ సాగరానివి అన్నాను
కాని నేను దాటలేని ఇసుక తీరాల
పంజరంలో చిక్కువడ్డ పక్షిని
నీవు, ఆకాశంలో విహరించే మేఘానివి అన్నాడు

పరమాత్మా! నీవు అనంతకాలవేదివి అన్నాను
కాని,
నాకొక నివాసం, విలాసం లేదు
నీవు అనంత భావ వాదివి
పేరు, ఊరూ, చిరునామా ఉన్న
పౌరుడివి అన్నాడు.

అసలు రహస్యం చెప్పమంటే
అది నాకూ తెలియదన్నాడు
నీవైనా, నేనైనా
ఎవరం ఏ రూపంలో ఉన్నా
అందరం, సమాధానంలేని
ప్రశ్నలడుగుతున్న పృచ్ఛకులమే
అనుకున్నాం
కలయేనిజమని, నిజమే కలయని
కాలక్షేపానికి ఒప్పుకున్నాం.